# విషాదకనకతారీయము

గ్రంథకర్త

విద్వాన్ ములుగు చంద్రమౌళిశాస్త్రిగారు.

ప్రకాశకులు

కే. కే. పట్నాయక్ & బ్రదర్సు

బుక్కుసెల్లర్సు,

ఏలూరు, కృష్ణాజిల్లా.

మొదటికూర్పు 1000 ప్రతులు.

ఏలూరు.

రామా ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

1923 సెప్టెంబరు.

 వెల 0—14—0

శ్రీ మీనాక్షీసహిత సుందరేశ్వరాయనమః.

# విషాదకనకతారీయము.

విద్వాన్

## ములుగు చంద్రమౌళి శాస్త్రిచే

రచియింపఁబడినది.

---

ప్రకాశకులు,

కె. కె. సత్యాయన్ అండ్ బ్రదర్సు

బుక్ సెల్లర్సు ఏలూరు, కృష్ణాజిల్లా.

మొదటికూర్పు 1000 ప్రతులు.

గాంధీ ముద్రాక్షరశాల. ఏలూరు.

డిశంబరు 1923.



వెల రు 0-14-0.

# ఈనాటకమునందు వచ్చుపాత్రలు

పురుషులు

సూత్రధారుడు
వీరసేనుడు—(కనకశేఖరుని తండ్రి)
ధీమంతుడు—(వీరసేనుని మంత్రి)
ప్రతాపుడు—(వీరసేనుని సేనాని)
రుద్రదేవుడు—(ఒకరాజు)
ధీవరమంత్రి—(రుద్రదేవునిమంత్రి)
కనకశేఖరుడు
భీష్ముడు
కంచుకి
ప్రాడ్వివాకుడు—(న్యాయవాది)
శోధనకుడు—(న్యాయమును విమర్శించువాడు)
యాకూబ్—(కూటసాక్షి)
ధనగుప్తుడు—(కోమటి)
పేరుసెట్టి—(నేరమును కనిపెట్టినవాడు)
రామసింగు—(పిటుకు)
భీమదాసు—(ఒక గృహస్థుడు)
మతిమంతుడు—రుద్రదేవుని పెద్దమంత్రి
కొందరు పౌరులు

స్త్రీలు.

నటి
చారుమతి—(వీరసేనుని భార్య)
తారావళి—(వీరసేనునికూతురు)
రాధ—(భీమదాసునిభార్య)
రదనిక—(అంతఃపురపరిచారిక)

శ్రీమీనాక్షీసహిత సుందరేశ్వరాయనమః

# ఇష్టదేవతా ప్రశంసనాదికము.

చ. శ్రితజన రక్షణాభిరతిఁ జేసి నిరంతర వాసమైన ప
ర్వతమునను వీడి మధురాపురమున్ శ్వశురాలయంబుగా
సతము వసించి మాదృశుల సన్నుతిఁ గైకొను సుందరేశుఁడీ
కృతికిఁ దగ్గ కుశీలవులకిష్ట శుభప్రతిపాదియయ్యెడున్.

మ. తనకారుణ్యమె లోకసౌఖ్య ఘటనోద్యత్కారణంబై తగన్
దనసాంగత్యమె సుందరేశ్వరున కత్యంతంబు మోదంబుగాఁ
గను శ్రీమన్మధురాపురంబున జగత్కళ్యాణ సంధాత్రియై
యనయంబున్ వసియించు భద్రద మీనాక్షిన్ మదిన్ గొల్చెదన్.

చ. నిముసమయేని మిమ్ము విడనేరక గన్నులఁగప్పికొంచు స
క్రమమగు శిక్షచేత సుకరంబగు శాస్త్రము నేర్పరించె బు
ధ్యమతి యతండు మాకు బితనందయ సూరివరేణ్యుఁ డస్మదీ
యమగుఁ గవిత్వమెల్ల కడలందు వెలింగెడి నట్లొనర్చెడున్.

ఉ. నేరనివాఁడనై చదువు నేర్పక యొజ్జలసఖ్య మొందగా
వారల వీరలన్ గలసి వాదము లాడుచు సంచరించు న
న్నారసి చేరఁదీసి యనయంబు శ్రమింపడి విద్యనేర్పె మా
భైరవమూర్తి సద్గురుఁ డపారకృపం గలితుండుగాఁడొకో

తే. తనకు ఛాత్రులయెడఁగల దయనుజూప
సకల శుభలక్షణావతంసయగుఁ గవిత
నాకొసంగెను ముదిగొండ నాగలింగ
శాస్త్రిగారికి నానమస్కారశతము.

చ. నను గనినప్పుడెల్ల వదనంబునఁ జిర్నగ వంకురింప ర
మ్మని తనయక్కు జేర్చి శుభమారయు నాతని వీరభద్ర శా
స్త్రిని దయతోడ నాదగుఁ గృతిన్ విమలంబగునట్లు పల్కఁగా
ననయము వేడికొందుఁ బరమాప్తుఁడు గావునఁ గౌతుకంబునన్.

తే. చాలశ్రమఁజేసి నాప్రభు లింగలీల
నచ్చువేయించె మామిడే లాన్వయాబ్ధి
హిమకరుండన వెలయు వీరేశలింగ
మెపుడు నాకట్టి మిత్రుఁడై యొనఁగుఁగాత.

శా. ఏనల్పజ్ఞుఁడనౌట నాకవితయందే దోషముల్ గల్గినన్
వానిన్ బోకడఁబెట్టి యాకృతిరహా యానందంబుతోఁ గన్గొనన్
యూనై పుణ్యము వేడికొందు నవరేనిన్ బీనవత్సో జన
మాన్యునూనాంగిని గౌరవంబుమెయి నిత్యంబెత్తి ముద్దాదరే.

విద్వాన్ ములుగు చంద్రమౌళిశాస్త్రి.

శ్రీ

మీనాక్ష్యైనమః.

# విషాదకనకతారీయము.

నాంది.

చ. క్రమము దొలంచి దుష్టుఁడయి కాముక వృత్తివహించి నీచ సం
గమము దలంచూని సాధుజనకహితాతుఁడౌ నుల పకుల్ సమూ
లముగ నశింపఁజేసి బుధులన్ కృపఁగాచు ననింద్యమైన ధ
ర్మము సకలార్థ సాధన పరంపర మీకొనగూర్చుఁ గావుతన్

సూత్రి:—(అనంతరముఁ బ్రవేశించి) ఆహా సకలకలాపరిశోభితంబును బండితపరికాండ మండితంబునగు నీ పరమ త్రీంబల్లజ్ఞుఁడనగు నన్నాదరించుటకు మదీయపూర్వ సుకృతపరిపాకంబున ననియే తలంచవలసియున్నది. (పరిక్రమించి ఆకసమువంకఁజూచి ఆశ్చర్యముతో) ఏమి నా యల్ప సంతోషము. ఇల్లలికి నంతనె పండుగయగునా, నా ప్రదర్శింపఁబోవు రూపకమున నీ నియోక్తల రంజించిగదా సంతస మందవలయును.

తే. ఎవ్వఁడేకార్య మొనరింప నెలమిఁబూను
నాతఁడాకార్యము ఫలించు నంతవఱకు
నొదగియుండఁగఁ దగుఁగాక యూరకిటుల
నల్పసంతోషమును బొందనగునె ఫలము.

అవును నే నీ గుణగ్రహణ ధురీణులు తమననుసంతవఱకు జాగ్రతగ నుండవలయును. (ముందునకు నడచి) జౌరా కాలవక్ర

పెన్నిరీతులఁ బరుగెత్తుచున్నది. నాకు దొలుత గలిగిన సంతోషమెల్ల భయంబుగ మారుచున్నదే. *సికజన పరీతమగు నీ సభాతలంబున నెట్లు మాట నిలుచునో తోఁచకున్నది.

(ఆలోచించి) అవును నిజమే.

తే॥ మంచి పొలమైనచో విత్తులుంచువాఁడు
బాలిశుండైనఁ బంటలు పండకున్నె
పైరులెల్లను జల్లెడి నానిగుణము
స్వీకరింపవుగాదె పృథ్వీతలమున.

కావున నా కార్య పరిసమాప్తికై విచారమావలదు. (తెలవంకఁ జూచి) ఏల నీ యతి విస్తరము.

నటి:—(ప్రవేశించి) ఆర్యా! ఇదే వచ్చితిని.

సూత్ర:—ప్రేయసీ! స్త్రీజన స్వభావమగు లస్యమింకనైన నిన్ను విడలేదుగా.

నటి:—ఆర్యా! అగ్రిహంపకుఁడు దుష్టమతులకృత్యంబులకుఁ గాల చక్రిముగూడ విపరీతమగునను విషయముఁగూర్చి నా సఖితో ముచ్చటించుచుండుటచేత నింత విలంబమైనది.

సూత్రి:—అయిన దాని కేమిగాని యేతన్మహా కార్య సంఘటమునకై నీ సాయము గోరవలసి వచ్చినది.

నటి:—సకలకార్య సాధన కుశలులగు మీకీ యబలసాయము జేయఁ దగినంత చతురయా. నాయందలి వాత్సల్యము మిమ్మిట్లనిపించు చున్నది. కాని అది యేకార్యము?

సూత్ర:—నిఖిలశాస్త్ర పారంగతులగు నీ సామాజికులెల్లరు నుందరేశ్వరోత్సవారంభమున నేదియేని యొక నాటకము ప్రయో

గింప నా కాజ్ఞ యిడిరి. కాఁక నీయుండవని విశ్వాసమున నియ్య
కొంటిని. కాన నిప్పటి వసంతర్తువును గుఱించి యించుక
గానము జేయుము.

నటి:—ఆర్యా! మనము ప్రదర్శింపఁదగినదే నాటకము!

సూత్ర:—అది విషాద కనకతారీయమను నైదంకముల నాటకము.

నటి:—దాని నెవరు రచించిరి.

సూత్రి:—

సీ. కృష్ణానదీకుల్యా తీరమౌ తెన్నాలి
పుర మనయంబు గాపురము గాఁగ
పులిపాక భైరవమూర్తిసద్గురుపాద
కమలముల్ వందనీయములు గాఁగ
సనకాదిమౌని ప్రార్జితలబ్ధ దక్షిణా
మూర్త్యుపాసనయె సమ్మోదము గాఁగ
సకలదిగ్దేశ నాయక సమర్పితములౌ
బిరుదముల్ వెలలేని సరులు గాఁగ

తే. సకలవిధ కావ్యనిర్మాణ చతురుఁడగుచు
సాటివారలలోఁగను మేటియగుచు
నెసఁగు మన ముల్లు చంద్రమౌళీశ్వరుండు
కర్తయైయొప్పు నారూపకమునకు బల.

నటి:—బాగుబాగు. ఆనాటకము నేఁడు ముఖ్యముగాఁ బ్రయోగింపఁ
దగినదే. ఇదే నా సంగీతముచేత సామాజికుల కుల్లాసముఁగలి
గించెద.

లయగ్రాహి. కోకిలలు మావి చిగురాకులను మెక్కి యల
పోకార్కఁదాకందు వెనఁ బైకొనుచు నుండన్

మూఁగలుఁగ జేరి పలుపోకలుఁగీరతతు
లాకసంబువెంట నెగఁబ్రాకుచు ధ్వనింపన్
నాకజలజాకరము శీకరములెత్తిపాలి
కోకములయానిలుఁడు పైకెగరజిమ్మన్
శ్రీకరవసంత కుసుమాకరము లోకహిత
మైకనఁగొనం గనులకేసుఖమిచ్చున్.

మఱియును:

తే. అగ్రజన్మునివంచించి యతనికొంపఁ
గోలఁగాఁజేసి దుష్టునిలీలమంచి
నడతలేకవియోగ ఖిన్నలగు సతుల
నేచ యత్నించు దర్పమందీదినముల.

సూత్ర:—అనన్యసామాన్యమగు నీసంగీతము మామకమనంబునపహరించుటకాక సభాసదుల వదనారవిందముల వికసింపఁజేసినది. ఇఁక నాలసింపక మనమేగి పాత్రములనాయత్తపరచుదము రమ్ము.

నటి:—అదిగో ధనలుబ్ధయై కౌటిల్యమువహించి యందఱను మోసించు తన స్వభావమును వార్ధకంబునఁ గూడ విడనాడ నంచరించు రదనిక కాలియులికిడి వినవచ్చుచున్నది. పోవుదముపసుఁడు మనమిందున్నచో దానికౌటిల్యాస్త్రంబునకు గుఱిగాఁగలము.

(ఇరువురు నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావనము.

———



శ్రీ

మీనాక్ష్యైనమః.

# విషాదకనకతారీయము.

## ప్రథమాంకము.

రదనిక ప్రవేశించి:— నేను పుట్టిననాటనుండియు నీ వీరసేనమహారాజు గారి యంతఃపుర పరిచారికలలోఁ జేరుపడి రాణివాసములకుఁ దగ్గఱబంధువువలె మన్నింపఁబడుచుఁ దలలో నాలుకవలెనుంటి ని. ఇప్పుడు నాకు వార్ధక్యము సంభవించుటచేతను చారుమతీ దేవికిఁ బుట్టినింటివారు పరిచారికల నరణముగా నొసఁగుటచేత ను మున్నువలె నంతఃపురమునకుఁ బ్రవేశించుటకును వీలు గలుగదయ్యె. ఎల్లకాలముఁ గాల మొక్కరీతిగ నుండదుగదా. ఎట్టివారికిని శరీరసత్వ ముడిగినవారలయెడఁ బనియుండదు. కనుకనే చారుమతీదేవి నన్ను కన్నెత్తియైనను జూడనొల్లదు. నే నామె కే యపకారమొనరించితినో తెలియదు. పోనీ ఆమె కు నాయందభిమానము లేకున్న నేమి నాకువలసినదిధనముగదా. ఏవిధంబునన్నైన దుష్టబుద్ధిని నా మాయలోఁబడవేసి వలసినంత రొక్కము నార్జింపకుందునా ? ఇప్పటివా రెందరైనను నాకాలి గోటికైనను సరియగుదురా !

చ. తపమొనరింపవచ్చునను నిదాఘదినంబులలోన నగ్ని మ
ధ్యపదమునందుఁ జేరి గిరినైనఁ బ్రయత్నమునన్ దృణంబుగా
నపుడె యొనర్పఁగానగు నహో ధనమున్ గణియించు చేరికే
కపటముఁబూనినన్ వలనుగాదు గదా ధరలోన నెప్పుడున్.

అందువలననే చాల దినములనుండి యనేక కష్టములకోర్చి ధన మార్జించు నుపాయమును గానవహోధ్యాయిగాఁ జేసికొంటిని. నాగూయ ను లొంగని వాఁడెవఁడు ఈ దుష్టబుద్ధియొక లెక్కయా. కావున నిపుడిది తరువు నతిజాగ్రతతో సంపాదింపవలసివచ్చినది. ఆహా చారుమతీదేవి చక్కఁదనమేమనివర్ణింపవలయును. కనుకనే యా యింతిపై దుష్టబుద్ధి మరులు జెందియున్నవాఁడు. దుష్టబుద్ధి యెట్టికార్యము నొనర్చినను జారుమతీదేవి మనసుమాత్రము చలించదు. (కొంచెమూలోచించి) ఏమైననేమి నాకుఁగావలసినది ధనముగదా. కావున దుష్టబుద్ధికొలువకై పోవలయును (అని పరిక్రమించును)

దుష్ట:—(ప్రవేశించి) (తనలోఁదలయూచుచు) ఇదియా వీరియాలోచనము. గుజ్జెవెంద తన నల్పెఱుఁగనటులఁ దామొనరించుఁ గార్యముల నుచ్చుటింపక యహరహంబు నాపైనేరములనే వెదకుచుందురుగా! సహస్రభానుని తేజంబు నహింపలేక డాఁగియుండు దివాంధమువలె మఱియు సాహసౌదార్యంబులకోరువక పిరికివారై చాటునఁ గొణఁగికొన నేమిలాభము. నే నేదియేని యకార్యంబుసల్పిన నా యెదుటమాటాడరాదో. (ఆలోచించి) ఏమీ నేఁజేయునది యకార్యమా ? ఇఁక సత్కార్యములెట్టివి ? పురుషుఁడై యుదయించినందులకు లోకోత్తరకార్యంబుల నొనర్చకున్న నేమిలాభము! అబలలవలె నస్వతంత్రము పౌరుషవంతులకుఁదగునా ?

మ. తనయిష్టంబగునట్టిరీతిఁ బరకాంతాసంగతిం జెంది సౌ
ఖ్యనికాయంబుల నొందుటో ధనముకై యన్యంబుఁ జింతింప కే
పనినేనిన్ బచరించుటో హితుల తోడ్పాటంది యెవ్వారి నై
నను జెండాడుటో యొప్పు లేనియెడ జన్మంబేటికిన్ గాల్పనే.

ఇట్టి నాగుణంబు లీయాత్మశ్లాఘాపరాయణులందు దివిటీ పెట్టి వెదకినను గనబడునా? (ఇంచుక నేపూరకుండి) వారి దుష్ప్రసంగంబులఁ దలఁచినకొలఁది నాకుఁ దోఁకఁదొక్కిన త్రాఁచునకువలె రోషంబావిర్భవించుచున్నది. ఇప్పుడీకోపంబున నా యతిప్రసంగులకడ కేగితినా వారిమెట్ట వేదాంతములకు నాకు శిరోవేదన గలుగక మానదు ఆవల రసాభాసంబగును. కావున నిపుడచటికిఁ బోఁగూడదు (తలపైకెత్తి) ఔ. మరచితి. దురాత్ముండగు వీరసేనుఁడు నన్ను బంధింపఁ బ్రతాపధీమంతుల కాజ్ఞయిడెఁగదా ప్రస్తుతము రానున్న యుపకారమునకుఁ బ్రతీకారమూహించెద. తోడఁబుట్టిన వాఁడుగదా యని యుపేక్షించి యున్నంగుల కీతుచ్ఛుఁడు నన్నే యంతిమొందింపఁ దలపెట్టెను.

ఉ. ఏవిధి నంచరింపఁ దన కేయుపకారము గల్గుచుండునో
యావిధి సంచరింపఁదగు నంద్రు సుఖంబును గోరువానికిన్
గావున మచ్ఛితాసిఁగొని కంఠములన్ దెగవ్రేయకున్నచోఁ
గావరమెక్కి నాకు నపకారముఁ జేయక పోరు శాత్రవుల్.

ఆహా! వీరసేనుఁడు,

శా. నాకున్ బెద్దగదా యటంచు మదిలోనన్ నమ్మి మచ్ఛాత్రవా
నీకంబున్ దరిఁ జేరఁదీసికొని దుర్నీతుల్ ప్రసంగించు నా
భూకాంతున్ బరిమార్పనున్న ఖలుఁడై మూర్ఖోక్తులన్నిన్ని న
న్నే కారాగృహవాసుఁ జేయఁ దలపూనెన్ నేటికిన్ దుష్టుఁడై.

తే. అగ్రజుండైనఁ బితయైన నమ్మయైన
నెవ్వరైనను దమకవ కృతినొనర్ప
దలఁతురవ్వారి దండింపఁ దగునటంచు
తనకుమాలిన ధర్మంబు ధరణిగఁ దె

కావుననే నేకోదరులమనినైన విచారింపక మదీయప్రాణాపాయంబునకు సమకట్టిన తదనుయాయులను వీరసేనుని వధింపవలసినదే

మ. మాఘుడో వెన్నుడో పద్మసంభవుఁడో దైత్యారాతియో లేకయా
శరజన్ముండో మదీయకోపదహనజ్వాలంబడక పోవు భూ
వరుఁ ధీమంతుఁ బ్రతాపునిక్ గరుణఁ బ్రోవక్ గంకణంబూని నే
డరుదేరన్వలెగాక యన్యులకు సాధ్యంబౌనె నన్నోర్వఁగన్.

(అంతటను గలయఁజూచి) ఏమది చిత్రపటమును గొనివత్తునని చెప్పిన రదనిక యింకను నాలస్యమునే చేయుచున్నది. కారణమేమై యుండును.

రద:—(దుష్టునిగాంచి) మహారాజా జయము జయము.

దుష్టు:—(రదనికనుజూచి) రదనికా సఫలప్రయత్నము గలదానవే గదా. ఏదీ చిత్తరువు?

రద:—అయ్యా! ఇదే చూడుఁడు. చారుమతీదేవి పోలుగమెల్లఁ జిత్రించుటకుఁ దగిన సాధకములు లేమి యేదో యొకరీతి వ్రాసితెచ్చితిని. (అనియిచ్చును.)

దుష్ట:—(చిత్తరువునందుకొని) సంతోషముతో రదనికా నీ యీ యుపకారమున కేమి ప్రతిసేయుదును. తడవుకాలమునుండి యేలావణ్యవతికై తనుధనంబులు జీర్ణింపఁ గష్టములనొందుచుంటినో యావరారోహా సౌందర్యము గానిపించి నాకుఁ గుతూహలము గలిగించితివి. (అని తనచేతికడియ మిచ్చును.)

రద:—(కడియమందుకొని కన్నుల నద్దుకొనుట)

దుష్ట:—రదనికా నీకా! కుబ్జైక రూపము లిఖించుటకుఁ దగిన సాధకములు దొరుకలేదా! చారుమతి కింతకన్న నెక్కుడు చక్కఁదనము గలదా నిజమేకదా అయ్యో నాదురదృష్టమునకు నీవేమి సేయుదువు. (ఇంచుక విచారించి) ఓసీ నీవిచిత్తరువు వ్రాయుటెందు నేర్చుకొంటివి? నాజీవితకాలములో నిట్లు ఛాయాపటముల వ్రాయు నీ వంటివారలఁ జూడఁగలేదా?

రద:—మహారాజా! ముదిమదిఁ దప్పిన నేను సాధకములులేమి కక్కుఱితికొట్లో వ్రాసిన యీపటమునకే యింత పొగడుచుంటిరి మా యుపాధ్యాయుచే వ్రాయఁబడిన పటములఁ జూచిన నెంత విస్మయమందుదురో గదా!

దుష్ట:—నామాట వినిపించుకొనలేదా యట్టినేర్పుగల మహానీయురా లెవరో చెప్పి నా కుత్సాహము గలిగింపుము. ఆమెను దర్శింపఁ దగినచో నాకన్నులఁ బవిత్రముగఁ జేసికొందును.

రద:—(స్వగతము) మంచి మార్గమునే త్రొక్కుచున్నాఁడు. వీనికిఁ జారుమతియందు మఱింత మోహము గలిగించి నా దారిద్ర్యదేవతనిప్పుడే తొలఁగించుకొందును (ప్రకాశముగా) రాజా. సంగీతసాహిత్యములు స్తనములుగాఁగ భరతశాస్త్రమెల్ల మెల్లని నడలుగాఁగ దనకన్న సౌందర్యవతులు ముజ్జగంబుల లేరని పొగడఁబడుచుండి యదితర కళలెల్ల నవయవములుగా నుండ (చిత్తరువును జూపుచు) నీహృదయమును దొంగిలించిన యీ మత్తకామినియే మాయుపాధ్యాయు

దుష్ట:—(ఆశ్చర్యముతో) ఏమీ చారుమతియా గురువు ఎన్న

డును చెప్పవైతివేమి. ఔరా! ఆకలికిన్నివిద్యలువచ్చునుగానీ వాక్యములు మృషగాదుగదా. పటమును చేతితోఁగనిపించుచు.

క. కనకమయగు నీగాత్రము
కనకమయగు వెలఁదివాసికయు సతినటులేఁ
గనకనిలువంగ నేర్చెద
గనుపించవెదాని నాదుకన్నుల కింకన్.

తే. పడఁతి చెక్కులు విమల దర్పణములేమొ
కలికిపల్కులు తేనియల్ చిలుకునేమొ
యింతిగుబ్బలు ఘుత్తడి బంతులేమొ
చెలియకన్నులుసూరుని ముకుళులేమొ.

రదనికా! నాకీయెలనాగ ననుభవించు మార్గముఁ జూపుము. నీవూనినచో క్షణమాత్రంబునఁ జారుమతిని గలయఁగలను నమ్మకమునాకు గలదు, నీవాలసింపకుము. ఈకార్యోద్ధరణమందు నీవు పనిగొనుట నా యదృష్టమేయని తలంచెద.

రద:—చిత్తము మీవంటివారు పనిపెట్టుట నా సుకృతమేగదా. (స్వగతము) ఈశశికళా సాధ్వియందింత మోహాతిరేకము గలిగించినది నా బుద్ధిబలమేగదా. వీఁడు మోసగాఁడు వీని ప్రేమ యెంత వఱకు నిజమో తెలిసికొనఁ వీని వ్రేళ్ళచే వీనికన్నులనే బొడచెదను. (ప్రకాశముగా) దేవా! నాసాధ్యముకొలఁది ప్రయత్నముచేసెదను. తరువాత మీ యదృష్టము దైవయోగమొందు ముఖ్యముగదా. ఆమె నిశ్చలచిత్త. కలనేని యన్య పురుషుని తలంపదు. నేననేక విధంబులఁ బరీక్షించితిని నాకు గురువుగానలొంగలేదు. మఱియునొకసారియత్నమొనర్చెదను.

దుష్ట:—రదనికా! అట్లందువేల? ఈమాటలకు నాప్రాణము నిలచునా. కొండంత యాశతో నీపలుకు విశ్వాసముంచియుంటినే. ఈ కార్యాచరణము నీ వలనఁగాక మఱెవ్వరివలనఁ గాఁగలదు. నీవు తలంచిన నట్లు గాదు.

రద:—అఘటనఘటనాసమర్థుఁ డగుఁ బరమేశ్వరుఁడు దలఁచినఁ గాని యీ పని నెరవేరదు. నాచేనైనదిగాన పటము గొని వచ్చితిని. కఠినశిలావిగ్రహము వలెఁ జలింపని యామె డెందము నెవ్వారు భేదింపఁగలరు. ఇందేమైన నుపాయమున్న నాకు సెలవిండు. దాని ననుసరించి వీలగునంతవఱకుఁ జూచెదను.

దుష్ట:—(స్వగతము) ఇది గొప్ప మాంత్రికురాలు. మనసు ప్రీతిగఁ దలఁచినచో రంభనైనఁ దరప్పింపఁగలదు. కాని యీనాఁడేటికో బీదవారివలె బల్కుచున్నది. కానిమ్ము దీని మనసు గఱగింప లేకుందునా? (ఆలోచించి) ఆ తెలిసినది. నిన్నటి సాయంతనమున నన్ను బంధింపవలయునని గదా వీరసేనాదులు దలఁచినది. వారు పెట్టుకొనిన గడువు నేఁడే. అందులకు చేయఁదలఁచిన ప్రతిక్రియయేది, వీరకేతుని సాయంబున వారల నన్ను బంధించుకోవలనే గడతేర్చవలయునని—వీరసేనుని బంధించి పాతాళగృహమున నుంచుటయుఁ దక్కిన వారల సంహరించుటకు ననునది. తరువాత నయముననో భయముననో చారుమతి నా వశ్యము కాకపోదు. ఈ విషయము నించుక రదనికకుఁ జెప్పి చారుమతి నచ్చటికిని బోం పోకుండునట్లు దాచియుండ నియమించెదను. (ప్రకాశముగా) రదనికా! నీయిష్టము వచ్చినట్లు కానిమ్ము. నేచేయునదేమి. నేనీనాఁడు బ్రతికి నీకుఁ గనఁబడినఁగదా పై యాలోచనము.

రద:—ఏమి యిది. క్షణములో నింత దైన్యము నొందుచున్నావు.

దుష్ట:—కుమ్మర సారెలాగునఁ గాలచక్రి మొక్క వరి దిరుగుచుండ దైన్యముగా నెట్లుండును.

రద:—ఎట్లు.

దుష్ట:—ఆ. తమ్ము గుఱ్ఱియనుచు దయఁదోడఁగలనైనఁ
బిలువకున్నఁగాని పేర్మినెడక
యున్న ననుసరించు చనయంబుదీనుని
వలెఁ జరించుచున్న వాఁడనుగద.

రద:—అవును నిజమే.

దుష్ట:—అట్టి మాయన్న దుర్మార్గులగుఁ గొందఱు దుర్బోధలవలన నన్యాయముగ దండింపఁ దలకొన్నవాఁడు.

రద:—(ఆతురతతో) అదెట్లు.

దుష్ట:—క కనకరవాలము నెఱగా
నొనరింపఁ దలంచి యుగ్రుఁడో యనఁ గ్రోధా
రుణితనయనుండగుచు నా
జ్ఞనొసఁగె ఘటునకు రదని శానన బట్టన్.

రద:—పాపము శమించుగాక. సోదరుండనియైనఁ గనికరము లేక యెంతపనిజేయ సాహసించెను. నీవు చారుమతిం గోరితివని తెలియలేనుగదా. దానికిఁ బ్రతిసీవేమి చేయఁదలంచితివి.

దుష్ట:—చేయుటకేమి గలదు. అతనిదిగదా యధికారము.

రద:—అట్లని తన ప్రాణములఁ గోల్పోదురా. ఏదేని ప్రతిక్రియ సల్పి రానున్న బాధను దప్పించుకొనవలయుఁగదా.

దుష్ట:—నాకేమియుఁ దోఁచుటలేదు.

రద:— బాగుగా నాలోచించిన నట్లు దోఁచకుండును-

దుష్ట:— నాకుఁ దోఁచిన విషయము చెప్పెదను విని యుక్తాయుక్తము లెఱింగింపుము. "తనకుమాలిన ధర్మంబు ధర్మమే గలదె" అన్నట్లు ప్రతివారికిని దమ ప్రాణము రక్షించుకొనుట ప్రధానము గదా! అందువలన నన్ను బాధింప ననుకట్టిన వీరసేనుని బంధించి పాతాళగృహమున నుంచుటయుఁ దక్కినవారలఁ జంపుటయు నాయుపకారము దొలంగఁ జేయుననని యెంచితిని.

రద:—అట్లు జరిగెనేని నీ శత్రువుల పన్నాగంబు వ్యర్థమగుట యగాక మన ప్రథమోద్దేశ్యముగూడ ఫలించునని యానీయభిప్రాయము

దుష్ట:—అవును.

రద:— బాగుగా నాలోచించితివి కాని యిందొక సందేహము బొడముచున్నది. ఏమందువా చిరకాలము నుండియు పౌరులను తన బిడ్డలను పోల్కి రక్షించుచుండు వీరసేన మహారాజుగారిని బంధించినచో నెల్లవారును పెయుందనూయఁ జెందుదురు.

దుష్ట:— దాన నాకు నష్టమేమి.

రద:— దాన నీకు రాఁబోవునష్టము చెప్పనలవిగాదు. పౌరులందఱును రాజుగారి యెడ నిష్టమున్నైన విశదీతురు అదియుఁగాక యీయన్నగాక నీపైన నిదివఱకుఁగల కోపమునకే గాక తనను బంధించి తనను గోధమునఁగూడ నిన్ను జంపఁగలండు. దానికన్న వేఱు కష్ట మేముండును.

దుష్ట:— అట్లయిన నమిత్రంబుగ వీరసేన మహారాజును యమలోకంబున కంపి చారుమతితోఁగూడ రాజ్యలక్ష్మిని పాణిగ్రహణము చేయుదును.

రదని:—(స్వగతము) ఓహో! యీదురాత్ముఁడు ప్రాణహత్యకుఁ గూడ వెఱవనట్లున్నాఁడు. వీఁడెంతకైన సాహసుఁడే వీని నీ ప్రయత్నమునుండి తప్పింపఁ జూచెదను. (ప్రకాశముగా) బాబూ లోకమునం దెవ్వరైన సోదరులయెడ గౌరవభావంబుఁ జూపుదురుగాని నిష్కరుణులై చంపఁజూతురా? పోనీ క్షత్రియునకు దోషంబు లేదందువా.

ఉ. పౌరుషశాలియైన నరపాలకుఁ డాజినెదిర్చి భీకరా
కారమునన్ ద్విషత్ర కరకాననము న్దగఁగూల్పఁ గావలెన్
నేరక యివ్విధిన్ గడఁగి నిద్దురఁ గూరెడివారిఁ జంపఁగా
శూరులు మెత్తురే యముఁడు చూచి సహించునె మేలుగల్గునే!

అదియుంగాక

తే॥ ధర్మమును దాన నాల్గు పాదముల నిల్పి
జగము నేలెడిఁ దన యగ్రజన్ముఁ జంపెఁ
జెనఁటి యగుచును దోలి దుష్టచిత్తుఁడనుచు
జనులు నిను బ్రువ్వఁ దిట్టరె సంతతంబు॥

కావున రణంబు జేసి శత్రువులఁ గూల్చుట శ్రేయంబగును. రాజ్యలక్ష్మియు నిన్ను వరించఁగలదు. మఱియు నీచరాచర ప్రపంచము నుండువఱకు నీయశము హరిశ్చంద్రాది మహీపతుల యశంబును గప్పియనింద్యమై యలరారఁగలదు.

దుష్టు:—కీర్తియేకాని యపకీర్తియేకాని రాజ్యముండనీ పోనీ ఏది యెట్లైనను నా కపకారము జేయఁదలంచిన యీ దుష్టుల జంపుటొండె వీరసేనుని బంధించుటొండె కావలయును. ఈ రెండు పద్ధతులందు నీ కేదిహితమో తెలుపుము.

రద:—ఈరెండు తెలుంగులకన్న వేఱొం డూహించఁగూడదా.

దుష్ట:—ఇవిగాక దేనివలనను నాయుద్దేశ్యము ఫలించదు.

రద:—అట్లయినచో కాలచక్రి యొక్క తీరున నెల్లప్పుడును నడు
వనుగదా. ఏనాటికెట్లు నీబుద్ధి మారునో నీకును దెలియదు.
అందువలన మీ యన్నగారిని పాతాళ గృహమున బంధించి
యెవ్వరికిని దెలియకుండునట్లు జేయుట మంచిది

దుష్ట:—ఇదియే మంచి యుపాయము.

రద:—ఈపని యితరులకుఁ దెలియఁదగినది కాదు. రహస్యముగాఁ
జేయవలయును.

దుష్ట:—అవును నిజమే

రద:—ఇందుకు సాయమొనరు మంచి సమర్థులు గావలయునే?

దుష్ట:—ఈవిషయ మిదివఱకు వీరకేతునితో నాలోచించియే
యుంచితిని.

రదని:—మంచిపని చేసితివి. నీపంట బండినట్లుకాని నన్ను మాత్రము
మరువవలదు.

దుష్ట:—అట్లు జరుగునని కలనేని తలంపకుము. (అని నిష్క్రమించును)

రద:—ఎంతెంతో నెంత జరుగవలసి నద్బును అహా ఇరువురుఁ జంపు
టయు విష్ణ్వంశ సంభూతుఁడునగు భూపాలునధోలోకంబున
బంధించుటయు సాధ్వీమతల్లిని జెఱవట్టుటయునా ఇందువలనఁ
గలుగు పాప పుణ్యములు నేనుగూడ పంచుకొనవలయు
నేమో. అవును ధనముగదా యంతపని చేయించునది.

మ॥ చెడుత్రోవన్ నడపించు సాధుజనులన్ శిక్షింపఁగాఁ జేయుఁగా
రడవిన్ వాసముగూర్చు నిర్మలకులోద్యద్వైభవంబెల్లఁ బో

కడ బెట్టున్ దనప్రాణమని విభవంగా బుద్ధి గల్గించునె
ప్పుడు గూడన్ దగదెట్టి వారికి ధనంబున్ గోరఁగా నిమ్మహిన్।

ఇట్లే చాలమార్లు నాకు నేను బుద్ధి చెప్పుకొనుచు మరల దీనినే గాంక్షించుచుంటిని. నాప్రాణము ధనము ధనమనియె యెగిరి పోవు నేమో.

(నిష్క్రమించును.)

తరువాత వీరసేనమహారాజు-ధీమంతుఁడు ప్రతాపుఁడు ప్రవేశింతురు

వీర—అమాత్యా! నాయీవిచారసాగర మపారముగదా దీని నెట్లు దరింపఁగలను

మ. అరిగాపుల్ వినతాంగులై రథగజాశ్వానీకమున్గాన్కఁగాఁ
బరగింపన్ జతురబ్ధివేష్టిత మహాభాగంబు భోగంబుగా
ధరియింపన్గలవాఁడనై యకట నింద్యంబైన కార్యంబు సో
దరుఁడేసల్పఁగ మాన్పలేకిటుల వంతన్ జెందుచుంటిన్గదా.

ధీమ:—దేవా! నన్నుఁగూడఁ దమసోదరుని విషయమైన విచారమ గ్నిలేకయే దహింపుచున్నది. వీరసేనమహారాజుగారి తమ్ముఁ డిట్టి యకార్యములనల్పుచున్నాఁడనిన దిగంతవిశ్రాంతయశో విశాలురగు దమకీర్తి కిట్టికళంకము గలుగునోయని యనేక విధంబుల మంచిమార్గమునకుఁ గొనిరాఁ బ్రయత్నించితినికాని నాప్రయాసమెల్లఁ బామునకుఁ బాలుఁబోసినట్టుల విపరీతముగ నయ్యెను.

వీర:—అవును దుర్జనస్వభావమట్టిదే.

చ అరయఁ బరోపకారియగు నాతఁడు దుష్టునిఁ జేరఁదీసి తా
స్థిరమతి మంచిమార్గ ముపదేశము జేసిన సాధువౌనొకో

ధరణిని వేపచెట్టునకుఁ దద్దయు జక్కెరనీరు వోసినన్
జెఱకగునే స్వభావమగు చేదును వీడి యొకప్పుడేనియున్.

కావున నీ పతియంతయు దుశ్చారిత్రునియం దూసరక్షేత్రమందు జల్లిన విత్తులవలె వ్యర్థమగుటయుగాక మీఁదుమిక్కిలి యీ నాతని యపకృత్యములకు వృద్ధినిచ్చుచున్నది

తే. సన్నిపాతోపహతుఁడై యున్నవాని
కలిమి మృష్టాన్నమిడఁ దలకెక్కుఁగాక
యంకురమునకు నీరోసినటులు వాని
వృద్ధికిఁ గారణంబగునే తలంప.

నే ననేకవిధంబులుగ సామదానములచే బోధించితిని వినఁడయ్యె. నాయుపదేశమంతయు వానియెడ నరణ్యరోదనమట్లు లాభము గాదయ్యె. ఆదుర్మార్గుని కృత్యంబులఁ దలఁచిన నాహృదయము వేయి వ్రక్కలగుచున్నది.

సీ. లాతినాతులఁ గన్న ప్రీతి యించుక లేక
బలిమి మైఁబడి చెఱఁబట్టుచుండు
సన్మార్గగాముల ఛాయ మైసోకిన
దయమాలి దండింపఁదలఁచుచుండు
నెదురయ్యెనేని యాఁకటుపులనై తను
ద్రుటికాలమును సహింపించుచుండు
పసిఁడిఁ దాల్చిరయేని పసిబాలురకుఁ గాని
విడక ప్రాణంబులఁ గడపుచుండు

తే. సమలమగు రాజవంశంబునందుఁ బుట్టి
సద్గుణం బొకింతయు లేక దుశ్చరిత్రుఁడగుచుఁ

వీరసే:—(ఆదరముతో) సత్వరము ప్రవేశింపఁజేయుము.)
(పౌరులు ధనగుప్తుఁడును దుఃఖముతో ప్రవేశింతురు.)

వీరసే:—ధనగుప్తా! ప్రాతఃకాల చంద్రబింబమువలె నీముఖము వెల వెలఁబోవుచున్న దేల కారణమేమి? (పౌరులఁ గాంచి) మీకీ తీరనిదుఃఖమేలకలైను!

ధన—మహారాజా! మాకష్టము లేమని చెప్పఁగలము:

సీ. బలగర్వమున సురపక్షి జెండాడిన
శూరుఁడౌ తారకాసురునికన్న
వేదముల్ దొంగిలి వెసనబ్ధిదాఁగిన
యనదయా సోమకాహ్వయునికన్న
ఇంద్రాణికై సంయమీంద్రులపై నెక్కి
యూరేగినట్టి నహుషునికన్న
ద్వ్యష్టుని వంచించి క్షితినాక్రమించిన
కతితుచ్ఛుఁడైన పుష్కరునికన్న

తే. క్రుద్ధుఁడై పాపనిరతుఁడై క్రూరుఁడగుచు
సిరుల కాశ్రయమైన యీ పురమునందు
దుష్టచిత్తుండొనర్చెడి దుండగముల
నకట వచియింప నెవ్వారికైన వశమె.

పౌరులు:—మాదొరో నీకు దండాలు నేనేమ్. మమ్ము రక్సించాలి సామా.

మంత్రి:—శాంతింపుఁడు శాంతింపుఁడు భయపడకుఁడు.

ధన:—(దైన్యముతో) మహారాజా! సహస్రభానుని కరంబులలోఁ బద్మవనమట్లు దేవర పరిపాలనంబున నేకొంతయు నెఱుఁగక

సుఖంబుండు మాకెల్లలకు నేటికి మీ సోదరునివలనఁ గలుగు బాధలు చెప్పుటకు వలనుగాకున్నవి. తానును తన మిత్రములును మా వాణిజ్యముల సాగనీయరు. మమ్ముఁ గాంచిన నాకొన్న కామాకాలము లల్లు పైఁబడి చావమోదుచుందురు. మేమేదియేని మా రాడిన మాకొంపలఁ గాల్చుచుందురు. అయ్యో రాజా! ఇఁకనైన మా కష్టంబు లీడేర్పుఁడు. తన భటులడిగినంత రొక్కమీయలేదను రోషంబున నిద్రించు మా పద్మనేన నెత్తుకొని పోవుటయగాక మా మేనల్లుని నిల్లు నిప్పంటించిరి.

వీర:—అకటా పౌరుల కెట్టి యిక్కట్లు వాటిల్లెను!

పౌరులు:— సామో యింక మేమీ వూళ్ళో కాపురాలుండి బతుకలేము. మా గొడ్డన్ని దుష్టబుద్ధి బంటులకు బలై పోతున్నవి. మాతోటలన్నీ పాడే మా గింజలన్ని దొంగలపాలే అయ్యో మమ్మి రక్షించండి. ఆడు సేసే పనులన్ని పాడుపనులే. ఒకనాడా ఒకపూటా ఎంతకాలమని ఓర్చుకుంటాము.

ధన:— దేవ! మఱియొక విన్నప మాలింపుఁడు

ఆ. కూడు నిద్దురయును గొఱయయ్యె ప్రజలకుఁ
గొల్లఁ గట్టివేసి కొనఁగవలసె
నహహ యెటులఁ జెప్ప నాతని కృత్యముల్
గాంచితీరవలయుఁ గానితండ్రి.

వీర:— ధనగుప్తా! ఇఁకమీఁద ననుఁ జూఁడనిదైనఁ దలంపక లోకకంటకుఁడగు దుష్టబుద్ధిని శాసించి మీవెతలఁ బాపెదను దుఃఖంపకుఁడు.

ధన:— తండ్రీ ! మాకష్టములఁ బాపి రక్షింపుఁడు.

పౌరులు:— దొరా మమ్ము రచ్చించండి (అని ధనగుప్తునితో నిష్క్రమింతురు.)

వీరసేన:— అమాత్యా వింటివిగదా దుష్టుని కృత్యములు. మనముపేక్షించిన కొలఁదియు వాఁడు మితిమీరుచున్నవాఁడు.

తే. తనచెలిమికాండ్రకు న్గానితనకుఁగాని
యెటులు దోఁచెను నయ్యది హీనమైన
మంచి చెడుఁగుల గణియింప కించుకేని
యుచిత కార్యంబు గతినల్పుచుండు నహహా!

తే. పేరునకుఁ దగినట్టులు క్రూరుఁడగుచుఁ
బిన్న పెద్దల నరయక పిదపవోలెఁ
గనుఁబడినవారినెల్ల నొక్కరినిఁగూడ
విడక బాధించుచుండు నెప్పుడు నతండు

కావున నాతని విషయమేమంటావు.

ధీమం:— దేవ ! అనుటకేమున్నది.

ఉ. పౌరుల పాలిమిత్తివలెఁ బాపమునే సతతంబుగోయు నా
క్రూరు నుపేక్షసేయు కిభకోటి పదాహతి మ్రగ్గఁ జేయుటో
వ రక యుష్మదీయ కరవాలమునన్ దెగవ్రేయుటో తగుఁ
మీఱిన కూర్మిచే విడుతుమేని మఱింత దురంతమయ్యెడిన్.

అని నేను తమతో నిన్నటి దినమున విన్నవింప వల్లెయని తమరు ప్రతాపున కాజ్ఞ యిచ్చితిరిగదా.

వీరసేను:— అవును నిజమే రాజ్యంబునకుఁ గలిగిన విపత్తునుగూర్చి వ్యగ్రమనస్కుఁడనగు నాకు జ్ఞాపకము లేదు. (ప్రతాపునిజూచి)

ఓయీ నేఁడే దురాత్ముఁడగు నాతని బంధింపుము. తరువాత
యాలోచింతము.

ప్రతాపు:—చిత్తము. ఏలినవారి యాజ్ఞ.

ధీమం:—దేవ ! ఇప్పటికిఁ జాలప్రొద్దయినది. నేటితో నీసభ చాలిం
చుట కానతీయుఁడు.

వీరసేన:—అట్లే కానిమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.





శ్రీ

మీనాక్ష్యైనమః

# విషాద కనకతారీయము.

## ద్వితీయాంకము.

దారుమతి ప్రవేశించి

దారుమతి:—(అంజలిబట్టి)

ఉ. నీవకదా సమస్తధరణీతలమున్ సృజియించి పిమ్మటన్
బ్రోవఁగ నేర్చి యంతమును బొందఁగఁ జేసి వెలుంగు దేజమౌ
జీవనకారణీ సకల శిష్టజనావని పావనీయిఁకన్
దావకపాదపద్మములెవన్ భజియించెదఁ గాళికేశ్వరీ.

తల్లీ జగదీశ్వరీ ! సకలచరాచర లోకంబుల కాధారభూతమవై చంద్రశేఖరు నర్ధాంగము నలంకరించిన నీసేవావకాశము గలిగినందులకు నేనెంతయు ధన్యురాలను. అనయంబును ద్వదీయ పాదకమల ధ్యానచిత్తనగు నాకుఁగలనేని నీపవిత్రనామంబు విస్మృతి గలుగున

ట్లుచేయక జగన్మాతవగు నీదాసురాలిని రక్షింపుము. నిఖిల రాజశేఖర సమర్పిత దివ్యమణిభూషణాన్యకృతాకాన సహస్రసంశోభిత స్వాంతుండగు వీరసేనమహీపతి కర్థాంగినగుట నీకృపావిశేషంబుననేకదా! తదవుకాలము పుత్రముఖ సందర్శనాభిరతిచేఁ జింతించుచు సాటివారలలో దీనులమైచరించు మాకు బిడ్డఁడుదయించి సంతానముగూర్చుట నీ నామస్మరణముకతనఁగదా ఈనాటివఱకిట్టులు నమ్ముకొంటి తెప్పవలె గాపాడుచుంటివో యటులే యిఁకమీఁదఁగూడ రక్షింతువని నమ్మియున్నదాన (వెనుకకుఁజూచి) ఈనాఁడేలొకో నామనోహరుఁ డింతదనుక వచ్చినట్లుగానరాఁడే. కారణమేమైయుండును. (ఆలోచించి) అవును మరచితి. కడచినరాత్రి దుష్టబుద్ధి పద్మసేనుఁడను కన్నియ నెత్తుకొనిపోయెనని ధనగుప్తుఁడా ఘోరకృత్యము మహారాజుగారితో విన్నవించుటకై చనుచుండునప్పుడు గాంచిన నా చెలి యిప్పుడేకదా చెప్పినది. పాపము పద్మసేన కెట్టియిక్కట్టు వచ్చెను.

మ. నిరతంబున్ ఖలమైత్రిచేత మదినింతే నిన్ విచారింపకన్
దురితంబుల్ బొనఁగించుచుండు ననుజన్మున్ మంచిమార్గంబునన్
నరిజేయున్ గృషి చేసిచేసి విఫలస్వాంతంబునన్ రాజశే
ఖరుఁ డున్నాఁడు కృశించుచున్ గటకటా కర్తవ్యమింకెద్దియో!

యాదవకులంబున ముసలంబువలె దుష్టబుద్ధి మాకులంబునఁ బుట్టి పూర్వులకీర్తిని జెఱచుచున్నాఁడు. హావిధీ! ఎట్టి పవిత్రమగుకులంబున నెట్టివానిని బుట్టించితివి!

చ. జలనిధిఁ బాడబంబటులు చంద్రుకరంబులలోఁ గళంకమున్
బలె నగరాజుపై తుహినబంధమురీతిఁ బవిత్రమైన మా
కులమునకిట్టి దుర్మతిఁ గూర్చి కళంకము దెచ్చిపెట్టితే
జలరుహనాభ పూర్వభవసంచిత మెవ్వరికైనఁ దప్పునే.

(ముందునకుఁజూచి) అదె నాజీవితేశ్వరుఁడు వచ్చుచున్నవాఁడు.

తే. చలదుడుపరీతమగు శరచ్చంద్రబింబ
మటులనలరారు విభుని యాస్యంబదేమొ
అకటనీహారకణ పరివ్యాప్తమైన
పద్మముంబలె స్విన్నమై ప్రభనుదక్కె.

వీర:—(విచారముతోఁ బ్రవేశించును)

చారుమతి:—ప్రాణేశ్వరా! నానమస్కారముగొనుఁడు,

వీర: —మనోహరీ! నీకుశుభమగుఁగాక.

చారు:—నాథా! కృష్ణపక్షపుఁ జంద్రబింబమట్లు మీ వదనంబు తేజో
విహీనమైయున్న దేల?

వీర:— (పలుకకుండును)

చారు:—(స్వగతం) కట్టా! ఎట్టియిక్కట్టులు గల్గినను ధైర్యంబుజెడక
నన్నుగాంచినంత నెంతోసంతోషంబున దరహాసముగావించు
నామనోహరుఁడేలొకో పిలచినను బలుకకవదనంబున తనవిచా
రంబును సూచించుచున్నాఁడు. కారణమెద్దియోకదా. (ప్రకాశ
ముగా) నాథా పలుకరేల (అని కౌగిలించుకొని)

తే. సాధుజనులనుగాంచిన శాంతరసము
వైరిపంక్తినిగనుగొన్న వీరరసము
కరుణననుగన్నవేళ శృంగారరసము
గురియుముఖమేలనమిఁగాంచుఁ గరుణరసము.

వీర:— దేవీ! ఏమని చెప్పఁగలను.

క. అనుచరుఁడై యెపుడేపని
నొనరింప ననుజ్ఞ శేతు నుచితమనుచునా

(4)

పనిఁ జేయుఁ బ్రతాపుఁడు త
మ్మునికతనన్ రూపుమాసిపోయెనుగదవే.

చారు:— (స్వగతము) కటకటా యెంత యన్యాయము సంభవించెను. తోడునీడయై చరించు చమూపతివియోగంబున వికలచిత్తుఁడై యున్న నావిభుని డెందమెట్లు స్థిరపఱుపఁగలను.

క. పతి కలఁతఁ జెందియున్నఁ డ
హితమున్ బోధించి యతని కేవిధినైనన్
మతిఁ గుదురుపడఁగఁ జేయుట
సతికిన్ ధర్మంబుగాదె జగతిగణింపన్.

కావున నీసమయమున నేరీతిగనైన నామనోహరు నూరడిలఁజేయుట నా కువిధగదా. (ప్రకాశముగా) జీవితేశ్వరా! అయినదానికి విచారమొందిన నేమిఫలము. ఊరడిల్లుఁడు.

తే. పుట్టుటయు గిట్టుటయు జగంబునఁ గలట్టి
ప్రాణులకు సహజంబగుఁగాన నెవ్వఁ
డేవనిఁ జయించువాఁడాపనియె స
మాప్తినొందించుచునుట యసాధ్యంబుగాదె.

వీరసే:— ఇంకేటియూరట— ఆదుర్మార్గుని కృత్యమింతటితో సమాప్తియయ్యెనా!

చారు:— సమాప్తిగాలేదు. (అని భయమునటించును)

వీరసే:— (కన్నీరు విడచుచు)

మ. హితుఁడై చుట్టమునై గురుండయి మదీయేచ్ఛంబగం జేలు నా
స్తుతిపాత్రుండగు మంత్రిసత్తముని దేజోమూర్తినిన్ గ్రూరుఁడై

సితవాలంబున దుష్టచిత్తుఁడు వధించెన్ మచ్ఛుహృచ్ఛిత్రవిభా
గతిగానంచు నెఱుంగనైతి నకటా కళ్యాణిమొల్లోత్పదన్.

చారు:—(స్వగతము) ఔరా దురాత్మా! ఎట్టి ఘోరకార్యంబులాచరించుచుంటివిరా. ఇట్టిఘాతకహింస నిన్ను నెన్నంటికి సంహరింపక విడచునా. (ప్రకాశముగా) నాథా! "విపదిధైర్యమథాభ్యుదయే క్షమా" అనుమాట మీరెఱుఁగనిదికాదు ధైర్యంబుఁబూనుఁడు. మనయదృష్ట మీనాటికిట్లున్నది. దైవయోగంబున కెవరేమిచేయఁగలరు.

వీరసే:—అవును నీవన్నది నిక్కువమే అయినను నిష్కారణంబుగ నిట్టి యకృత్యంబులు జరుగుచుండఁ జూచి సహించుటకష్టము గాదా. ఇప్పుడు వారలఁజంపిన వాఁడు రేపట నన్ను మాత్రము విడచునా?

చారు:—నాథా! అటులెన్నటికిని గానేరదు. మీనోటవచ్చు నమంగళవాక్యములు నాకుఁ గర్ణకఠోరములుగ నున్నవి.

వీరసే:—దుర్మార్గుఁడగు నాసోదరుని కృత్యంబులఁగాంచిన నాకీప్రాణంబులపై యసహ్యముగలుగుచున్నది నామిత్రులనెడఁబాసియీతనువుతోనుండ నేమిఫలము.

చారు:—మనోహరా! లోకంబున నెవ్వరైన విధివశంబునఁ జచ్చినవారలకై బలవంతముగఁజత్తుమను వారుందురా? జీవహింస యకార్యమని మీరెఱుఁగరే.

ఆ. బ్రహ్మహత్యయు గోమాంసభక్షణంబు
ప్రాణహింసయు స్వర్ణచౌర్యంబు మొదలు
గాఁగల యకృత్యములు నరకమునఁద్రోయు
ననుచు పెద్దలువచియింప వినఁగలేదె.

వీరసే:—కాంతా! నీవాడినపలుకులు యథార్థము లేయగుఁగాని సకల శత్రునాశన చతురులై మదీయరాజ్యశ్రీ స్థిరీకరణకార్య హేతుభూతులగు నమాత్యసేనాపతుల విడనాడి జీవింపఁగలనా? ఒక్కప్రతాపుఁడే త్రుటికాలంబునఁ ద్రిలోకంబులనైన సాధింపఁగల నేర్పరిగదా. స్వయంవరమున నాఁడఱరాజులఁ బరిభవించి నీవు నన్నువరించితివని యోర్వలేక జుట్టుముట్టిన దిగంతపాలకులనెల్ల ఖడ్గమాత్రసహాయుఁడై పారఁదోలినధీమంతుని పరాక్రమము నీవెఱుఁగవా! అట్టిమంత్రి సేనానాయకులు నాకీజన్మంబున లభింపఁగలరా. (ఖడ్గమునుద్దేశించి) ఓ సకలవిపక్ష పక్షచ్ఛేదనదక్షమగు నోకౌక్షేయకమా నేనీ పవిత్రమగు రాజవంశంబునఁ బుట్టితినేని నీవే పరిపంథికులకాలపవిత్రమవగుదువేని తీవ్రమగు నీధారచేత నాకంధరను బలిగొని స్వామికార్యధురంధరులగు ధీమంత్రప్రతాపులనేనాఁగలజన్మంబునఁగూడ మంత్రి చమూపతులఁగా నొనరించి సుకృతంబుఁ గాంచుము.

(అనికత్తిచేతఁ దలనఱకుకొనఁబోవును)

చారు:—(కత్తి నూడఁబెఱికికొని) అయ్యో నాథా! మీకీసాహసమేల? భూతహింసయకార్యముని యెంతవేఁడుకొనినను మీమనసు స్థిరపడదేల. ఆత్మహత్యకన్నమించిన పాపము వేఱొండు కలదా.

మఱియును—

సీ. అఖిలంబునీవయంచరసి ప్రవర్తించు
నీయదృష్టవిహీన కవరుఁగిక్క
చిరకాలమునకుఁ గాంచిన చిన్నిబిడ్డలు
కష్టముల్ వీడఁజూగఁగలరె కద్ద

నిరతంబు భవదీయ పరిపాలనంబునఁ
బ్రొదిచెందెడి ప్రజ కేదిత్రోవ
రక్షించు నీభుజాగ్రమునఁ బాండవమాడు
రాజ్యలక్ష్మికి వేఱు రక్షకుఁడెవఁడు
తే. భూధరముగాఁగఁ జెనఁటివై పుట్టి క్రూర
కార్యముల కొడిగట్టెడి కలుషమతుల
శాసనముఁజేయ నేర్చెడి చతురుఁడెవఁడు
హితులకై ధాత్రి విడిచి నీవేగు పిదప.

కావున మీకుఁ బ్రాణత్యాగ ముచితముగాదు.

వీర:—అయిన నీ హీన స్థితికిఁ గొనై ఎట్లు రాజ్య మేలఁగలను.

చారు:—దుష్టుని జెండి చిరంజీవియగు కనకకేతుని భుజాపీఠమున రాజ్యలక్ష్మిని నిల్పి వానప్రస్థాశ్రమమునఁ దపోధనులఁగూడి కాలము గడపుట మంచిది.

వీర:—ఇవియేగదా సాధ్వీప్రపంచమునకు లక్షణములు.

(ప్రకాశముగా)

తే. హితవియోగంబు కతన జీవితముఁ బాయ
దలఁచుచుండిన నాకు నీతులను గఱపి
శాంతమును కూర్చి తీవ్రా స్వాంతమిపుడు
నంతసించెను నీవికా సతివిజగతి.

నీనుడువులరీతి పాలసింపక పూజ్యమగు నెల్లరాజ్యమును కుమారున కప్పగించి యాశ్రమమునఁ జేరెదఁగాక.

చారు:—(నిట్టూర్పు విడచి) (స్వగతము) అక్కా యిప్పటికిఁగదా నేను ధన్యురాల నయితిని.

(తరువాత కనకశేఖరుఁడు ప్రవేశించును.)

కనక:-ఆహా అదిగో నాయనగారివదన మెంతవిచారగ్రస్తమైయున్నది.

మ. రణ రంగంబునఁ జుట్టుముట్టియు రిపువ్రాతంబు పెల్లార్చి మా
గణముల్ పైఁబడఁగించునట్టి నయిన ధైర్యంబూని వర్తించుచోఁ దా
ననుమాత్రంబును జెన్కలేక తుహినవ్యాప్తంబగు బింబంబటుల్
గణియింపన్ బడుచున్న దేలొకో జగత్కల్యాణు మోమియ్యెడన్.

(ఆలోచించి) అవును కులనాశకుండగు దుష్టబుద్ధిచేయు దుండ
గములఁ దలంచి నాయనగారు చింతానిమగ్నులై యున్నారని యిప్పు
డేగదా మాభగిని తారావతి చెప్పిపోయినది దుష్టబుద్ధి దుష్కృత్యము
లకు సహింపలేక పౌరులు నాయనగారితో విన్నవించుకొన దుష్ట
శిక్షాదక్షుఁడగు నామకపిన తమ్ముఁడనియైనఁ గనికర ముంచక
యాదురాత్ముని బంధింపుఁడని మంత్రి సేనాపతుల కాజ్ఞ యిడినంత
యెట్టులో దాని నెఱింగియాక్రూరుఁడు నిద్రించు మంత్రిచమూ పతుల
జంపెనట. కట్టా యెంతమోసము సంభవించెను. ఇంకనైన నాకుటిల
స్వభావుని దండింపవలయును లేకున్న మితిమీఱి సాధ్యుఁడుగాఁడు—
అదే నాయనగారమ్మగారితో నేదియో ముచ్చటించుచున్నారు.
(సమీపించి) తల్లిదండ్రులారా! నమస్కరించెదను.

చారు:—నాయనా! ఇటురమ్ము (అని కౌఁగిలించుకొనును.)

కన:— (తండ్రిఁజూచి)

తే. అనుజునెడఁ గూర్మిచేత రాజ్యమున కెల్లఁ
గీడొనర్చుచు నుండినఁ గూడ నిటులఁ
దమకుపేక్షించి యుండఁగఁ దగునె ప్రజల
కష్టసుఖములు మనయవిగావె తండ్రి.

వీర:—(ఆశ్చర్య దైన్యములు ముఖమున నటింప) నాయనా నేనేమి చేయఁగలను. అతఁడు దుర్మార్గుఁడుగదా.

కనక:— చేయుట కేమున్నది.

మ. తన యిల్లాలయినన్ సుతుండయిన మిత్రంబైన నాచార్యుఁడై
నను దమ్ముండయి యుండినన్ దుదకుఁ బ్రాణంబైనఁ దోనాడిలో
కనికాయంబులకున్ సుఖంబు నలుపంగా యోగ్యమౌ గాక నం
దునకున్ జాలని బీదవోలె మదినెంతో చింతిలన్ గార్యమే.

చారు:—ఏమీ నాబిడ్డఁ పౌరుషము యోధాగ్రేసరులవోలె ధైర్యమునఁ బల్కుచున్నాఁడు రత్నాకరుని గర్భసీమ నుదయించిన చంద్రుఁడులోలె నాహ్లాదకరుఁడగు వీనిపల్కులకు నాకెంతయో సంతసము గల్గుచున్నది.

వీర:—(చారుమతినిగాంచి) దేవీ ! చూచితివా యీకుఱ్ఱవాని సాహసంబు పదియేండ్లయిన సంపూర్ణముగ లేని నాముద్దులపట్టి మాటలకును దుష్టబుద్ధి యొనర్చు ఘోరకృత్యములకును

తే. అర్కుఁడుదయింప నస్తమయంబుఁ జెంద
జలజమునకే యవస్థలు సంభవించు
నాయవస్థలు రెండొక్క యెదను నందె
కాంత నావదనంబునఁ గానఁ బడెను

(కనకశేఖరునిజూచి) నీ ధైర్యమునకు సంతసించితిని. అయినను నా యిప్పటి యవస్థఁగన్న వెనుకనుయ్యి గుంట ముందు జెఱువున్నట్లున్నది.

కనక:—తండ్రీ ! కులనాశకుఁడగు వాఁడెవఁడైన నేమి యవశ్యంబు వధ్యుఁడేయగు మీకాదుర్మార్గునందు మోమోటముండెనేని నాకానతిండు.

వీర:—కుమారా! నీవు పసివాఁడవు. విశేషించి లోకజ్ఞానము లేని వాఁడవు. అందువలనఁ దోఁచినట్టులఁ బల్కుచుందువు. ఇప్పు డా దుష్టుఁడు వధింపఁ దగఁడు.

కనక:— ఎందువలన.

వీర: —తాఁ జేసిన కార్యము నింద్యమైనదిగాన దానివిషయమై నేనే మైనఁ దన్ను దండింపఁ దలకొందునేమో యని యతఁడు జాగ్రతగ నుండును.

కనక:—అయిన నాతని విషయమై యుపేక్షాభావమేనా!

వీర:—కాదు సమయ మపేక్షించెద

కనక:—తమచిత్తమట్లు గానిండు నేనిఁక నావనికై యరిగెద.

(అని నిష్క్రమించును.)

వీర:—జీవితేశ్వరీ! నేఁడా దురాత్ముని గూర్చి విచారించుటవలన నాకుఁ దీరని శిరోవేదన గలుగుచున్నది కావున శయనించెద. ఇప్పటికే చాల రాత్రి యయినది. నీవును నీ శయ్యాగృహ మున కరుగుము,

(అని శయనించును జారుమతి నిష్క్రమించును.)

దుష్టమతి: —(ప్రవేశించి) నాకాజన్మ శత్రువులై యహరహంబు నాయన్నతో నా నేరములఁ జెప్పుచుండువా రిరువుర వీరకే తువు సామర్థ్యమున యమలోకమున కనిపితిని. ఇఁక మీఁద వీరసేనుని బాతాళగృహమున బంధించవలయుఁగదా. (నలు వంకలఁ జూచి) ఆభీతుఁ డిందెచ్చటను గానవచ్చుటలేదు. ఒక వేళ నాయత్నమెఱిఁగి పారిపోయి యుండఁడుగదా. (దల కంపించుచు) ఏమీ నాకుఁ జిక్కక పోనేర్చుఁగా నామనస్సు

నకు గుఱియగువాఁడీ పదునాల్గులోకములలో నెందుఁడాఁగినను బ్రతుకనేర్చునే — (వెతకి వీరసేనుని గాంచి) ఓహో యిక్కడ నేపడి నిద్రించుచున్నవాఁడు నా పరిశ్రమమూరక పోవునా? (దగ్గఱకుఁ బోయి కత్తి నెత్తి) వీని నీ తివాసి చేతఁ బెద్ద నిద్దుర నొందింతునా! (వెనుకకుఁ బోయి) కాదు కాదు. కాలచక్రి యెప్పటి కెట్లు దిరుగఁగలదో. పోసి పాపము. అగ్రజుఁడు కదా. విడచిపోయెదను నాపై గొండెములఁ జెప్పు ముండకొడుకులఁ జెండితినిగదా? ఇఁక నా నేరము లితని కెవరు చెప్పఁ గలరు. (ఆలోచించి) బాగు బాగు. మంచి పనియే. వీని విడచితినా నా కష్టమంతయు వ్యర్థమే. ఈనఁగాంచి నక్కలపాలు జేసినట్లగును. నా మొదటి యుద్దేశ్యము చారుమతిని గూడుటకదా అది యెట్లు సంభవింపఁగలదు. కావున వీరకేతువు నుడివినట్లుఁ జేయుటయే మంచిది.

(అని వీరసేనుని బంధించును.)

(పిమ్మట తెలివి పడును.)

(తెఱలో) తే. నిలు నిలుము పోకుపోకుమా నిలఁ తనీవు
నీకు రక్షకుఁ డెవ్వఁడీ లోకమందు
నా పరిశ్రమమది చెడునా తలంప
వంట యింటి కుందేలెట్లు బారఁగలదు.

చారు:— (దుఃఖముతో ప్రవేశించి) ఓ దీనరక్షకులారా! ఆర్త పోషకులారా! భూతదయాపరులారా! రక్షింపుఁడు రక్షింపుఁడు.

ఉ. ఏనొక దీనురాల దురదృష్టవశంబున దుష్టబుద్ధికిన్
లోనయితిన్ కృపారసవిలోకనముల్ జెలువారనిప్పుడో

హా సూర్యచంద్రులార సుగుణోదధులార మునీంద్రులార న
న్యాసముతోడ మీరలయినన్ నను దగ్గఱఁదీసి బ్రోవరే.

తే. నగములార మహాజపన్నగములార
యక్షులార శ్రీతావనదక్షులార
క్రూరుఁడగు దుష్టచిత్తుని బారినుండి
గావరే మీరలైన నన్నగుణతోడ.

అక్కటా యీ మహారణ్య మధ్యంబున నాకు దిక్కెవ్వరు. ఎంత విలపించినను నన్ను రక్షించు పుణ్యాత్ముఁ డొక్కఁడును గాన రాఁడు గదా. అయ్యో యిట్టి విపత్తు కలుగునని యెన్నఁడైనను దలంచితినే. దైవమా! యెంతలో నెంతఁ జేసితివి. బాలచాపల్యమున నైనఁ బరుల దుఃఖపెట్టి యెఱుఁగనే అట్టి నాకీభరింపరాని వెత గల్గింపఁ బాడిరా. హా దుస్స్వప్నమా! ఎంత పనిఁ జేసితివే క్షణమాగిన నీకు శాంతిఁ జేయించుదునుగదా. ఇంతలోనే త్వరపడవలయునా ఎన్నఁడును నీ సామర్థ్యము నాకెఱింగింప నదను దొరకనందులకా. తఱిజూచి యీ పని గావించితివి హా మృత్యువా! నీవైన దయఁదలఁచి యీ దరిద్రదేవతను మ్రింగివేయరాదో నాకీకని యిడుములఁ గల్గించిన నేమిలాభము. జగదీశ్వరీ కాళికా! నిన్ననేగదా నీసేవఁ జేసి వేఁడుకొనినది అప్పుడే నాపై నేల రోషము గల్గెను.

[అని మూర్ఛపడి కొంతవడికిఁ దెలిసి]

తే. నిస్సపత్నుండగుచు ధరణీతలంబు
సౌఖ్యముగ నేలు నా రాజచంద్రునకిలఁ
బత్నినై పుట్టి యొక్కని భాగ్యకతనఁ
బడఁగరానట్టి కష్టముల్ బడగవలసె

అహో యీ మహాటవి సంచరించు క్రూరమృగ మేదియైనను నన్ను మ్రింగిన బాగుండునుగదా. (సముద్రమును గాంచి) ఓరత్నాకరా సకలలోకాధార! నీవు దక్క నాయాపద దప్పింప నెవఁ కలరు. నీదరి జేరితి రక్షింపుము.

చ. మనుజనకాత్మజా విరహమూర్ఛితుఁడై యెదఁగుందుచుండరా
మునకుఁ బధంబుఁ జూపి యతనిన్ గొనినట్టి జగన్నుతుండవే
యనఘ యగాధనై యిటులనన్యుని బారికిఁ జిక్కి చింతలన్
మునిఁగిన దీనురాలనను బ్రోవఁగ రావదియేల నక్కటా

రమాజనకుండవగునో మహానుభావా! నామొరాలకించి నన్ను రక్షింపుము (కొంచెమూరకుండి) జగన్నాధుఁడగు నాదినారాయణు నకుఁ గన్యాదానము గావించిన పవిత్రమూర్తి వే మహేంద్రుని బారికి జిక్కి వెతఁగుందుమై నాకునిగా పాడిన యుత్తమ గుణుఁడవే అట్టినీవి యురదృష్టవంతురాలిని రక్షింపభారమా తండ్రీ!

(నిలునిలు పోకుపోకు అను వెనుకటి పద్యముతో జనుపుము దుష్టబుద్ధి ప్రవేశించును.)

చారుమతి:—అక్కటా దైవమా! ఇంతటనైన నన్నీ దుష్టుఁడు విడచునట్లులేదే.

చ. నిరతజితారిసాధరణి నేతకుముద్దులకాన్పుగా ధనా
భరణకు భూమిదేవికి సపత్నిగఁ బుట్టి నభక్తినామహే
శ్వరు చరణారవిందముల సంతతముగ్ భజియించునాకు నా
గ్గ్వరణముగల్గునట్టులుగ వ్రాసితె హా విధి ఫాలమందునన్.

(అని సముద్రమునఁ బడఁబోవును.)

దుష్టబుద్ధి.—(అడ్డమునచ్చి) ఏమె నీ గయ్యాళితనము నీ చెరరింపుంకు

భీతినొందుచునుంటివా అట్లున్నచో నిది దలంపకుము. నామాట వినుము. (అని లేవఁదీయును.)

చారు:—(లేచుచు) హా జగదీశ్వరీ! రక్షింపుము. రక్షింపుము.

దుష్టబుద్ధి:—తరుణీ! ఈవృథా కాలక్షేపముచేత నన్నాయాసము బెట్టనేల (అని పట్టుకొనఁబోవును)

చారు:—(తప్పించుకొని స్వగతము) అయ్యో దైవమా! ఇంతటనైన నన్ను విడువక మఱియు నేమి సేయఁ దలఁచితివి. కలనైన పరపురుషుని మోముఁ జూడనొల్లని నాకీ భుజంగుచే బాధగలుగునట్లు జేయ నేమిటికి (ప్రకాశముగా దుష్టబుద్ధిఁ జూచి) అయ్యా పరకాంతలను బలిమిని జెఱబట్ట మీవంటి యుత్తమాన్వయులకుఁ జెల్లునా

దుష్ట:—ఓసీ! ఎంత గయ్యాళివే పరకాంతనని పల్కినంత విడుతునా నీవెవతవైన నేమి.

చారు:—అయ్యో పరకాంతాభిరతి దోషావహము పెద్దలు నుడువ వినవా!

సీ. గురుపత్నితో రతి గూడ సజ్జారికి
ఘనతరంబగు కళంకంబుగల్గె
సీతామహాదేవి జెఱగొన్న రావణు
కులము నిశ్శేషమై కూలిపోయె
గౌతముపత్నిపైఁ బ్రీతిఁ జెందిన శచీ
కాంతుని మేన రంధ్రములు బొడమె
ద్రౌపదిగూడ యత్నంబొనరించిన
సింహబలుని పేరు శేషమయ్యె

గీ. బృందయో మైత్రిగాంచి గోవిందుఁడహహా
రుక్మిణియో జన్మములు ధాత్రినెత్తినాఁడు
జ్ఞానసిద్ధికిని బరకాంత యెవుడు
కోరఁగా రాదు కలనేని క్రూరచిత్త.

దుష్టబుద్ధి:—[తనలో] ఏమీ నీవు పరకాంతవా? నీతోఁగలసిన నాకు దోషమా పాపము నానేమమునకే చెప్పుచుంటివిగాఁ బోలు కనుకనే యిట్లు గావించితివి. [ప్రకాశముగా] తరుణీ నీకుఁ దోఁచినట్టులుగాఁ బల్కి నన్ను నమ్మించి పారిపోఁజూచితివి నీవెన్ని భంగులఁ దప్పించుకొన యత్నించినను సాగదు. వారివారి ప్రారబ్ధమునఁ జెందుదురుగాని యన్యకాంతలఁగలసినంతఁ జెడిపోరు. ఇటువినుము

సీ. మేనకా సమరతిఁ బ్రాపికగాఁ జేసి
ఘనతఁ గోల్పోయెనే గాధిపట్టి
దాశకన్యాకేళిఁ దమిఁదీర నొనరించి
రహిచెడినాఁడె పారాశరుండు
పరమపావనియైన భాగీరథినిఁగూడి
చింతల నొందెనే శంతనుండు
అంబాలికా సంగమంబును గావించి
వంశంబునిల్పఁడే వ్యాసమౌని

మఱియు.

తే. మునుపెంద లెందఱో మాండకర్ణి
మొదలుగా గలవారలే ముఖ్యమనుచు
నన్యకాంతలఁగూడి రనంగలాలి
వారిగణియింపఁగా నేల వనిత యిపుడు

వున నీ యుపన్యాసముల విడచి నాదయకుఁ బాత్రివవు గమ్ము (అని దగ్గఱకు బోవును)

చారు:--తండ్రీ ! నన్ను ముట్టరాకుము. నిగ్రహానుగ్రహసమర్థుఁలగు నీవుచెప్పినవార లెంతకైనఁ దగుదురు. వారెల్లరో లోక మహోపకారార్థోద్ధరణమునకు సంచరించిరిగాని కామోద్రేకంబున గాదు. పులిఁజూచి నక్క వాతవేసికొనినట్లు వారినిజూచి మన మాచరింపఁదగునా. నీయంత వానికిఁ గావలయునన్న దివ్య కాంతలనైన మించెడు బోటులు దొరకరా! అనాథనై దిక్కు లేక పిక్కటిల్లు నీశోక సాగరంబున మునిఁగిన నన్నేలగోరెదవు.

నష్టు:—కాంతా ! ఎందఱకీ యసత్యములగు ధర్మశాస్త్రముల నా మోత్రి విప్పెదవు ఇవియన్నియు ముదిమిచే మనచెదరిన ఛాందసులచేఁ గల్పింపఁబడినవి కాని వేఱుగాదు. అట్లుగాక నిక్కవములని తలంతువేని ఆధర్మశాస్త్ర రచయితలేవన పర్ణాంబు భక్షులై యరణ్యములందు ముక్కు మూసికొని యనేక విధంబులగుఁ దపంబులు సల్పుచు మునులి తపసులె యెందఱో సుందరాంగులఁగూడి సురత కేళికల నోలలాడిరి గదా. అదేమనినచో వారు సమర్థులు మన మసమర్థుల మనియు శ్రీరంగపతులు దద్దెదవు. నిన్నే మన వలచును.

చారు:—(తనలో) అకటా యీ దుర్మార్గున కెన్ని హితోపదేశ వాక్యములు చెప్పినను బూదిలోబోసిన నేయివలె వ్యర్థ మగుచున్నవే. ఇఁకేమి సేయఁగలను. (ప్రకాశముగా) అయ్యా నావిన్నప మాలింపుము.

ఆ॥ ఊరు దూరమయ్యెఁ జేరువయ్యె నుసాము
పతినశించెదుఃఖ మతిశ యించె

నిట్టి నన్నుగోర నేమి సౌఖ్యంబగు
వలయునేని తగినవారు లేరొ.

దుష్టబుద్ధి:—తరుణీ! నీకీ విరక్తి యేమిటికి? నాతోడఁ గలసి సకల సౌఖ్యంబులఁ జెందరాదా? నిష్కారణంబుగఁ (బ్రాణములేల హింసింపఁ జూచెదవు అనాథను మోహించి) చాటిన స్వయంవరమున నిన్నుఁ గాంచినది మొదలు నేటివఱకు నీసుందరవదనారవిందము గాంచవలయునను కుతూహలమున నుంటిని నాకష్టము వృథా చేయకుము.

చారు:—చీదురాత్మా! ఎంత జెప్పినను వినక యవాచ్యంబులనేఁ బల్కుచుంటివిగా (అని కోపముతోఁ జూచును.)

దుష్ట:—(ఆశ్చర్యముతో) ఓసీ! నీచురాలా! ఏమని పల్కితివి. నీయిష్టముగా నడచుకొన వలయునని యుపేక్షించిన కొలంది నన్ను దృణముగ కన్న నీచముగఁ బల్కుచుంటివి.

మ॥ అతివా యేటికి నాకుఁ జెప్పెదవు నీకై మంత్రివర్యుఁ జమూ
పతినిఁ జంపి జగత్ప్రసిద్ధుఁడగు నీప్రాణేశ్వరుఁ నేఁడు దు
ర్గతి పాల్చేసితి నేమిచేయవలె నింకన్ నన్ను మోసించియే
గతిఁబోనేర్తువె నాఁడు దిక్కగును సౌఖ్యంబెచ్చటన్ గల్గెడున్

చారు:—ఆ॥ నాకనిత్యమైన లోకంబుపైగాని
యాత్మపైనఁగాని యాశ లేదు
వ్యర్థముగను నేఁడ వాచ్యముల్ బలికిన
బాపకర్మ మున్న చచ్చియుంటి.

నాయనా! లోకంబున మదోన్మత్తులై కన్నుఁగానక పరకాంతలఁ జెఱఁబట్టు దుష్టుల శిక్షింపఁదగిన నీవంటి పుణ్యులకు నావి వగునలు విచారింపక పతివిహీనంబున నెతనొందు నాఁ బోటియబలలఁ

గామింపఁ దగునా దేహంబు రోసి మృత్యుముఖమునఁ బడుటకై లేచియున్న నా వలన నీకేమి సౌఖ్యము గలుగఁ గలదు.

దుష్టబుద్ధి:—(స్వగతము) ఏమి యీ టక్కులాడి నేనెంత సామము చేతఁ జెప్పినను వినకున్నది. (ప్రకాశముగా) కలికీ! ఇఁక నా మాట వినుము చెడిపోకుము ఆనేతు హింసాచలమువలెను దుష్టబుద్ధియని సార్థకనాముఁడనైన నా బారినుండి నిన్నురక్షించు వాఁడు లేఁడు. నాకుఁ గోపము దెప్పింపకుము.

చారు:—సీ॥ నాప్రాణపదమైన క్షేత్రపాలవరుఁ జంపి
యేపాటియశము గడించినావొ
స్వామిహితుండైన ధీమంతుఁ బోకార్చి
యేపాటి యశము గడించినావొ
అసమానశూరుఁడౌ నప్రతాపునిఁగూల్చి
యేపాటి యశము గడించినావొ
శాంతస్వభావులౌ సాధులహింసించి
యేపాటి యశముగడించినావొ

తే. అనదనై దిక్కు లేకయున్నట్టి నన్ను
జెండి యేపాటియశమె గడింతుగాక
యేమిచేయఁగ నేర్చెదు హీనచరిత
చావునకు రెండుచావులు జగతిగలవె.

దుష్ట:—ఓహో ఎంతవైరాగ్యముతో బల్కుచుంటివి. బ్రతుకనేర్చిన దానవే. (తనలో) ఈకాంత నే నెంతజెప్పినను జెడచెవినిబెట్టి ప్రాణత్యాగమునకైనఁ దెగించుచున్నది. ఇఁక నాకోరికసిద్ధింప దేమొ. ఇంతట దీని విడచిపోదునా. కాదుకాదు దీనిబిడ్డలఁ

కూడ నరణ్యమునఁ జంపి రమ్మని నా మిత్రు నియోగించితివి గదా (పరిహాసముగా) ఓసీకులటా! చావునకైన వెరవని నన్నీతఁ డేమిచేయునని యా స్త్రీధైర్యము ఇదిగో శపథము వినుము.

తే. నిరతమీవ్యారికై నీవు నీమగండుఁ
బరితపించుచునుండు రాచఱికమైన
కన్నబిడ్డలఁబట్టి చాగములకరణి
నరకి బలియిత్తు గాళికినాడెగనుమ.

అప్పటికైన నన్నుగూడ సమ్మతింపవా?

చారు:— హా నాబిడ్డలారా! మీకీ నిర్భాగ్యురాలికతన నకాలమృత్యువు వాటిల్లునా పరమేశ్వరీ! ఎంతవారి నెంతజేసితివి (దుష్టబుద్ధిని గాంచి) తండ్రీ! ఎంతవేఁడినను నీకు దయరాదుగదా. కన్నుల దెరవని నాపసిపాపల నేలచంపెదవు వారు నీకేయపరాధముగావించిరి. నీకపరాధమొనర్చిన నన్ను జంపి నీ పగ దీర్చుకొనఁ గూడదా.

తే. చంపితివియెందఱనో మహాసాధువులను
చాలదే నీదుపాపిష్టిజన్మమునకు
మఱియు నాచిన్నబిడ్డల మడియఁజేసి
యేమిసుకృతంబుఁ జెందఁగ నెంచెదీవు.

దుష్ట:—(తనలో)

తే. ఒక్కతఱిఁ బ్రతిమాలిన నక్కటికము
విడచి దూరుదురింకొకవేళయందుఁ
దమకుఁదా మనుదెంతురు తరుణులందు
కతన వారలరంజించి కలియఁదగును.

కావున నీకాంతచిత్తము కఱఁగునట్లు దైన్యముతో వేఁడుకొనుట మంచిది. (ప్రకాశముగా) కలికీ!

తే. అలఁగఁ బిలుకాని ములుకులై యలరు నీదు
వాలుఁగనులను త్రాళ్ళచే వసితనన్ను
బంధితుని జేసి విరహాగ్ని బడఁగఁ ద్రోఁచి
సాధ్వినని వల్కఁగా నీకుఁ జను నెయిట్లు.

తే. తరుణి తావకమృదుపదతాడనముల
కైన నోర్చెదఁ గాని నేఁడంగభవుని
నిశితశరపాతములకు చేనిలువలేను
ప్రాణదానంబుఁ జేసి పుణ్యంబుగొనుము.

పరిమళత్తుంద బంధురంబగు నీ సుందరాంగంబుఁ దనివిదీర రదనికాసామర్థ్యంబునఁ జూచితిని గాని నీతనూదేశంబు నాలింగనంబు జేయు భాగ్యంబు లభించదయ్యె. నేఁగావించిన దోషంబులనెల్లఁ బోఁ దోలి మదనపిశాచగ్రస్తశరీరుఁడనగు నన్ను నీమృదువాగ్మంత్రములఁ బవిత్రుని జేయుము. నీకై యిట్టి యకృత్యములాచరించిన నాయందుఁ బ్రసన్నవుగావేని వ్యర్థముగ రెంటను జెడినవాఁడనగుదును.

(అని సమీపమునకుఁ బోవును.)

తారు:—ఛీ యీ దేహంబుతో నీఁక క్షణమైన నిలువఁగూడదు. ఈ దుర్మార్గుఁడు నానోపాయంబులచే నన్ను మోసంబుఁ జేయ యత్నించుచున్నవాఁడు. ఓ సకలలోకనిర్మాతవగు నో కాళికేశ్వరీ రాఁగల జన్మంబునఁ గూడ తారా కనకశేఖరులనే బిడ్డలగను వీరసేనమహారాజుగారినే పతిగను నాకు దయచేయుము. నా కీసముద్రుఁడే శరణమగునట్లు కావింపుము.

(తారాకనకశేఖరులఁ దలంచుకొని)

అయ్యో బిడ్డలారా! మీ కెంతగతి పట్టినది. (స్వగతము) తుచ్ఛమైన నా మిమ్ము విడచియుండఁగల నా? అట్టి మిమ్ము నెడఁబాసి మనోహరుఁ గోల్పోయి మృతిఁ బొందక యుండి యెట్లైన బ్రతికి యేమిలాభము.

(సముద్రుని నుద్దేశించి)

ఉ. సతతము నీపదాబ్జముల సన్నుతిఁ జేసెడి దాననేని వి
 జిత సకలారి యా నృపతిశేఖరు బట్టఁపుదేవి నేని యే
 గతి నయినన్ మనున్ ధరణికాంతుని చెంతకుఁ జేర్చినాఁడు సం
 తతియును గూర్చి యీ కనకతారను బ్రోవఁగదే సరిత్పతీ.

(అని సముద్రమునఁ బడును)

దుష్ట:—ఓరీ! దీనిసాహసము మేమనవలయును చూచుచుండఁగనే నా కన్నుఁగప్పి సముద్రమునఁ బడినదే. (ఇటునటుఁ జూచి) ఇఁక నాకిక్కడఁ బనియేమి. ఇప్పటికిఁగదా వీరసేనుని కుటుంబము నాశముఁ జేసినవాఁడనైతిని. ఇఁక మీఁద నెదురులేక తిరుగవచ్చును

(అని పోవును)

(తరువాత వీరకేతువు కనకతారలతోఁ బ్రవేశించును)

కన—సీ. కటకటా యెట్టియిక్కట్టులఁ గూర్చితే
 పసిపాపలకుఁ బాల పండ్లనాఁడె
తార—అయ్యయ్యో కరుణ రాదయ్యనే నీమదిఁ
 జిఱుతకూనలకిట్టి చెఱుగుపల్కు
కన—అక్కటా మాకింక దిక్కెవ్వరగుదురో
 ప్రాణముల్ నిలిపి కాపాడువారు
తార—అహహ యిదేటి న్యాయంబొ నోరెఱుఁగని
 పసుగందులనుఁ జంపఁ గాఁదలంప

కన— శ్రితజనావనుఁడను పేరుఁ జెందినావు

తార— జగములకు సౌఖ్యములఁ గూర్పఁ జాలినావు

కన:— అట్టివేల్పువు నీకు నమ్మరసిప్రోవ

తార— నేర్పు లేదె రమా రమణీకళత్ర.

అయోధ్యా యీనిర్జనారణ్యమున మాకు నెక్కవ్వరు. హరిహరీ తు
దట్టి యిక్కట్టు గలిగెను. (కనకునిఁ జూచి)

క. కలనైన నిరపరాధుల
నలమటఁ జెందించి యెఱుఁగ మాకెన్న మనకీ
కలుషాత్ముఁడైన దుష్టుని
వలనన్ దుర్మరణమంద వ్రాసెనుగద రా.

కన— సీ. జనకుఁ డురక్షింపఁ జాలునంచరియున్న
నతఁడు రంభాశ్లేష మందినాఁడు

తార— జనయిత్రి మాకష్ట నదితిఁ బాపునటన్న
నామెయు నిడుమలలో మునింగె

కన— ధీమంతుఁ డఱుదెంచి తెఱఁగుఁ జూపనటన్న
స్వామిమార్గమున నే జనునతండు

తార— వాహినీపతిమిష్టు వారించుననుకొన్న
నాతఁడు నాకసౌఖ్యంబుఁ జెందె

కన— తే. చతురుదధివేష్టితావనీ చక్రిమందు
గానరాఁడొక్కఁడేని రక్షకుఁడు మాకు

తార— చంపవో బ్రతికింపవో సరగ నిపుడు
క్రూరుఁడవో సాధువవో నిదె భారమయ్య.

(అని వీరకేతువు పదములపైఁ బడుదురు.)

వీర:—ఓరీ! నీచులారా! మీరాపిల్లలై నను మీయుక్తిమాత్రము చెప్పదది. ఇంతమాత్రముననే యావీరకేతువు మిమ్ములనదయఁదలఁచి విడచువాఁడుగాఁడు.

తే నింద్యమేయగులేక యనింద్యమెయగు
గిల్బిష మెయగుఁగాక సుకృతమెయగును
వీరకేతుండుచిక్కిన వారివిడక
చంపుననుమాటయొకటి నిస్సంశయంబు.

క:—(స్వగతము) ఆహా యేమివీనిపౌరుషము. రాచపాపలనియైనఁ దలంపక తనప్రతాపం బెల్ల మాయందే చూపుచున్నాఁడు.

తార:—అయ్యో! పసిపాపలముగదా. నీకేమిద్రోహముసల్పితిమి. దాయాదియగు దుష్టబుద్ధివలె నీవును మామీఁద నేలకోపించెదవు. అయ్యో నీవును బిడ్డలఁగన్నవాఁడ వేకదా. తలిదండ్రులు లేని యీకూనలవిడచి పుణ్యముఁగట్టుకొనుము.

చ. జననుతమార్గమున్విడచి సౌఖ్యమె శాశ్వతమంచు నెంచి మా
జనకునిఁజంపి క్రూరుఁడయి సజ్జనగర్హితుఁడైన దుష్టబు
ద్ధినిగని మమ్ముఁజంప వెనుదీయవదేమియొ క్రూరకార్యమున్
బనివడ దేటికయ్య పరిపంథులమా గణియించిచూడుమా.

వీర:—ఓసీ! నీమిట్టవేదాంతములు నాముందర సాగిరావు. ఇదే నాఖడ్గమువలన మీశిరంబులఁ దెగవేసెదను. మీ యిష్టదైవములఁ దలఁచికొనుఁడు

(అని కత్తినెత్తుచు) (తారా కనకశేఖరులు మూర్ఛపోదురు)

వీర:—[ఆలోచించి] ఔనౌను. పాపమీ చిన్నపాపలఁ జంపినలాభమేమి. యేనాఁడేశిశుహత్యగావించితినో యానాఁడు నే నపుత్రకు

డనయితిని. అందునను రాచబిడ్డలుగదా. [కత్తి వరలోఁ బెట్టి వారల మెల్లన లేవఁదీసి] పిల్లలారా! మీయందు నాకుఁ దయగలిగినది. మిమ్ముల విడచెద. నెక్కడనైన పోయి బ్రతుకుఁడు పొండు.

[కనక తారలు సంతోషము నభినయింతురు]

వీర:—(నిష్క్రమించును)

[వారలు కొంతదూరము నడతురు]

తార.చ. నడువఁగ రావుపాదములు నాలుక కైఁ దడియారిపోయె మే
న్వడకెడు స్విన్నమై ముఖము వన్నెదొఱంగెఁ గొంతయేనిఁ గ
న్పడదు పథంబు కన్నులకుఁ బ్రాణము నిల్చెడునట్లు దోఁచదీ
యడవి నెవారుదిక్కగుమరయ్య కృపామతిఁ బ్రోవఁ దమ్ముఁడా.

అమావాస్య రాత్రియందువలె కన్నుఁబొడచికొనినను గానరాకుండునట్లు బగటియందును గాఢాంధకారము గల్గించు నీయరణ్యంబున నెంతదూరమని నడువఁగలను. ఎటువిన్నను క్రూరమృగంబులరొదలె. ఏదెసఁ గాంచినను దవానలంబువోలె మంటలెగయుఁ గొఱవిదయ్యంబులే. ఏచక్కి నడచినను నూదులకన్న వాడియగుఁ దుమ్మకంపలే. ముందునకు నడచుదమన్నఁ జేతగాకున్నది ఏమిసేయుదును.

(అని మెల్లఁగ నడచును),

కన:—ఆహా దైవమా! ఎట్టియిడుములఁ దెచ్చితివి. అహరహంబున స్ఫటికశిలానిర్మితంబులగు సౌధాంతరంబులఁ బరిచారికాశతంబు లాలింపఁ గాంచన సౌధాంతరముల మాణిక్యడోలికల సుఖంబుగఁ గాలంబు గడపు మాకీ దుర్గమారణ్యము శరణముగఁ జేసితివా నేనిట్లోపక జెందినను గోమ

లొంగియుండు మా భగిని కష్టమోర్చునట్లు లేదు. ఎట్లైనను తప్పదు గదా. (ప్రకాశముగా) అమ్మా సోదరీ! దుఃఖించిన నేమిలాభము. లోకంబునఁ బుట్టిన యెట్టివారికిని గష్టంబులు గలుగుట స్వభావమే కదా! ఇంచుక సహింపుము.

సీ. రాజ్యంబు నెల్ల రారాజున కొప్పించి
కుంతీసుతులు వంతగుందలేదె
దారపుత్రాదులందఱఁ గోలుపోయి పం
చముఁ గొల్వఁడే హరిశ్చంద్రనృపతి
కులసతి నెడఁబాసి ఘోరాటవులలోన
రహిదుఃఖమొందఁడే రాఘవుండు
ప్రచ్ఛన్న రూపంబుఁ బడసి యీడగు చోట
వసియింపఁడే నలవసుమతీశుఁ

తే. దైవరిఫాలంబునం దజుఁ డెట్లు వ్రాసె
వారి కారీతి సుఖదుఃఖ పాళిగల్గుఁ
బ్రాజ్ఞుఁ డద్దాని నెఱిఁగి యెప్పటికి నెల్లఁ
గాఁగలదో దాని ఫలమును గాంచవలయు.

తార:—తమ్ముఁడా! ఎంతని యోర్చుకొనఁగలను సహింపరాని యీ మార్గాయాసంబునకును బ్రళయకాలమందలి యగ్నిజ్వాల వలె మండుచున్న జఠరాగ్నికిని నా ప్రాణములు నిలుచునట్లు లేవు. దాహము విస్తరించుచున్నది. దోసెడు నీళ్ళు గొనివచ్చి నా ప్రాణము నిలుపుము.

(అని మూర్ఛిల్లును.)

కన:—అయ్యో దైవమా! గారాబమున మమ్మెత్తి పెంచుచు ప్రాణంబుల నెల్ల మామీఁదనె యుంచికొనిన తలిదండ్రులతో

వియోగము గలిగినను మాసోదరిదైనను నాకుఁ దోడుగనుండఁగదాయని యీ కష్టసాగరోత్తరణమున ధైర్యము గలిగియుంటినే. ఆమెను గూడఁ జంపి యీ దిక్కుమాలిన నన్నేమి చేయఁ దలంచితివి. [నలువంకలఁ జూచి] ఇందెక్కడను గుక్కెడు నీరుఁగూడఁ గానవచ్చుట లేదు. [ముందునకు నడచి] అదిగో అక్కడ నేదియో యొక కొలనున్నట్లున్నది. అటకేగి సలిలంబుఁ గొనివచ్చెదఁగాక.

[అని నిష్క్రమించును.]

తార:—[మెల్లనలేచి కనకునిగానక] అయ్యో దురదృష్టమా! మా సోదరుఁ గూడ నెడఁబాపితివా!

[ఇటు నటుఁ జూచి అంతను వెదకుచు]

సీ. కనరుగదా మీరు గగన సంచరులార
కనకుని జాడ నెక్కడనుగూడ
అనదనై నాకుసాయము జేయఁగూడదో
జలదమా మీవంటి సాధువులకు
మారాడినంత మీమహిమఁ గోల్పడుదురా
హరిణంబులార యీ యబలతోడ
నాకష్టములఁజూడ నీకైన దయరాద
కననియెట్లుండఁ గాంచనమయివుడు;
తే. అకట యేదిక్కులేక మీయండఁ జేరి
బ్రతుక దలఁచిన మమ్మెడఁ బాపఁదగున
గహనదేవతలార యొక్కరునుగూడఁ
దెలిసి దాచరు గదకమ్ము తెలుఁగుమీరు.

అయ్యో దైవమా! ఈ యరణ్యమం దెక్కడనని వెదుక గలను. దాహముచే మూర్ఛపడిన నాకై నీరు దేనచటికైనం బోయెనా? ఇప్పటికి నేమూర్ఛపడి చాలసేపైనది. అట్లుపోయిన కనకశేఖరు నేదేని క్రూరమృగము వాతవేసికొని యుండదు గదా. ఆహా దుర్విధీ యెంత దిక్కుమాలిన దాసిగ జేసితివి. [అని వెతకుచుబోవును.]

ఇది ద్వితీయాంకము.





శ్రీ

మీనాక్ష్యైనమః.

# విషాదకనకతారీయము.

## తృతీయాంకము.

రుద్రదేవుఁడు:— [ప్రవేశించి ముందునకుజూచి]

సీ. ఏదిక్కు గాంచిన నెఱిదీర్ఘతరములై
క్షితిఁ బ్రాకెడి కొండశిలలపిండు
ఏమూలఁ గనుఁగొన్న నించుమించుగఁ బర్వ
తములమించెడి మదేభములసందు
ఏవంకఁ జూడఁగన్నఁ గ్రొవ్వులై చేరి యు
య్యాల లూగుచుండు కోతుల యెలుంగు
ఏచాయఁ గాంచిన హృదయభీకరములౌ
నారావము లొనర్చు క్రూరమృగము
తే. ఏకడఁ గన్నఁ గానిన గాఢవిచయ
కలకలంబు లెచటఁ గన్నఁ గర్కశాశ్మ
పరివృత ప్రదేశంబు లీ వనమునెల్లఁ
గడచిపోవుగ నీ వందెకాడ నేను.

మఱియును —

చ. ఇనుఁడలచక్ర సంతతుల నేలి తమంబు హరించి వృద్ధుఁడై
తనకలుషంబువాయఁగ నెదన్ దలపోసి తపోభిలాషచే
జీయజగం బరాజకము సల్పి నృపుల్ తుదమోక్షకాములై
చనుట నిజంబటంచెఱుక సల్పెడి రీతిని గంటి ధీవరా.

మంత్రి! ధీవరా! ఈ మహారణ్యమున గమ్యస్థానమునకు మార్గంబు గాన్పించుట లేదు. అడిగి తెలిసికొందుమన్నను మనుష్యమాత్రుఁ డొక్కఁడను గానరాఁడు. (సమాధానము గానక వెనుకకుఁ దిరిగిచూచి) ఏమిదీ ధీవరా! ధీవర! ఓహో! వేటకాండ్రు దారితప్పి విడిపోయినట్లే ధీవరుఁడును దారితప్పెనా! ఔరా! యెంత మోసము సంభవించెను. సాయంకాలమగుచున్నది. మార్గము తెలియకున్న ప్రాణము గాఁచికొనుదునన్నఁ జేత నొకకోలయైన లేదు. ఇట్లా ఈ దినము వేటకై రాఁగవలదని నా ప్రాణేశ్వరి యెంత వేడినను వినక వచ్చినందులకుఁ దగిన ప్రాయశ్చిత్తమైనది. అబ్బా యిది సముద్రతీరప్రదేశము కాఁబోలు. ప్రొద్దుగ్రుంకుటకైనను సహస్రభానుని కరసంతాపము మాత్రము ముడుఁగ లేదు.

ఉ. నాలుక యెండిపోయె జరణంబులు నిప్పులఁ ద్రొక్కినట్టుగా
గాలుచునుండెఁ జెమ్మఁగిలెఁ గాయము నశ్వము తగ్గె క్షుత్పిపా
సాళి యతిక్రమించెఁ దపనాహతి కోర్వఁగ నెవ్వ రిట్టిలీ
వేళ యొకండ నేను వనవీధిఁ జరించుచు నిర్భయంబునన్

(ధైర్యమవలంబించి)

తే. సృష్టికర్తకెట్టు లిష్టమో యుండు న
ట్లవని జరుగుగాని యన్యమగునె
దైవయోగములను దప్పింపఁ గలవారు
మూఁడు వేళలందుఁ జూడఁగలరె.

ఇంక నాపట్టణమున కెన్నాళ్ళకుఁ బోఁగలుగునకో కదా.
అకటా రాజ్యలక్ష్మి.

సీ. సత్యహరిశ్చంద్ర సాధుబాహుద్వయ
 సౌధాగ్రములఁ గ్రీడసల్పినావు
నలమహారాజు నిర్మల శాసనంబున
 వసియించి సుఖములఁ బడసినావు
పాండవాగ్రజు ధర్మపరిపాలనమున
 నిశ్చింతతో నాదిసంతసించినావు
బుధకుమారుని పరిపూర్ణ గౌరవమున
 శాశ్వతమ్మై వృద్ధినందినావు

గీ. ఎందరో రాజవర్యుల హీనభక్తి
 నహరహమునీకు సేవలాచరింప
 నలరితివి నేటికీ మ్లేచ్ఛయాకతమున
 రహిఁదొలంగితివే నన్ను రాజ్యలక్ష్మి.

చ. నిరతమువందు నీకొఱకు నిశ్చలతన్ దపియించువానిపై
 యరుచిని జెందివీడిచని దారవి వేశనుఁ లేక లుబ్ధుఁడై
 తిరిగెడివాఁడె నీకుఁ దగుదిట్టరియౌఁగద రాజ్యలక్ష్మి నో
 కరణినిజూడనిట్టి కలికాలమునందున మంచియున్నదే.

ఆహా నీవొకచో నిశ్చలవై యుండవు గదా.

చ. సరసులపై సఁగోపము యశస్కులఁగన్న ననహ్యమాటుసూ
 భరణులమీఁదభీతి శ్రితపాండులం దనురాగశూన్యతం
 వ్వారికడ నివ్విధంబిక నివాసమొనర్చగ రాజ్యలక్ష్మి యం
 దరుఁ బగవారలైన వసుధాతలి నిల్వఁగజోటుగల్గునే.

ఏమి యీవెఱ్ఱి నా దురదృష్టంబునకుఁ జింతిలకఁ బవిత్రయగు రాజ్యలక్ష్మిని దూరుచున్నవాఁడ.

సీ. కామమా యింక నెక్కడకైనఁ జనరాదె
నన్నీవనాడి కొన్నాళ్ళపాటు
క్రోధమా నీయుక్కు గూడదా వేరుచో
పరముఁ భాగ్యుని వంచదక్క
లోభమా యేరీతిగా భరింపఁగనేర్తు
నిన్ను నన్నడఁబాసి నిలువలేవు
మోహమా యింతేనియూహ లేదయ్యొ
నీయభివృద్ధి మార్గంబు నరసికొనఁగ

గీ. మదమపదపడినీకు సమ్మదము గలుగు
పదములెదుకంగఁ బొమ్మిదీ పదముఁ గోలఁగిన
మత్సరమ నీకు నేఁదక్క మహి నొకండు
గలుగఁడే చెట్టఁబట్టి సుఖంబు జెంద

ఓ శత్రువులార! మీరాకీఫలంబులేని యాశ్రయంబు వలన నేమి సుఖము మృగయాభిరతిచే నేను మోసమొందినట్లు నాయందలి యనురాగముచే మీరును మోసము జెందనేల (తలయెత్తి యాకసమువంకఁ జూచి) ఏమి యీ యనాత్మజ్ఞత నన్ను బాధించు నీయరిషట్కంబున కుపదేశము జేయుచుంటినేల వీనిని జయింప సామాన్యులకువల నుపడదే.

సీ. కామంబుచేత శంకరునంతటి మహా
త్ముఁడ దారాంగమందున నతివఁ జేర్చె
క్రోధంబుకతన శ్రీనాథునంతటివాఁడు
తనకీయవచ్చు భూధవునడంచె

లోభంబుకలిమిమై లోకేశునంతటి
వాఁడు సృష్టిని బడుపాతమూని
మోహంబునకుఁజిక్కి పుత్రహారకునంతవాఁడల
తపోధను భార్య నంటుకొనియె.

గీ. మదమునన్ గురుకులమెల్ల మంటగలపె
మత్సరంబున నహుషుండు మహినిజెడియె
కాన నెవ్వారికైనగాని దుష్ట
శత్రువర్గంబు గెలువంగ శక్యమగునే.

లోకంబులెల్ల వ్యాపించి తమ కెదురులేక సంచరించునట్టి యరివర్గంబు గెలువ నేనెంతవాఁడ [ముందునకు నడచి] ఆహా విధిని యుంగఁ దరముగాదు గదా

ఉ. ఒక్కనిమీఁదపై నిలుపు నొక్కనిభూమికి నేతఁజేయువే
రొక్కనిగౌరవించు మఱియొక్కనిగూటికి లేనివానిఁగాఁ
జెక్కువిధంబులన్ సలుపుఁ జెప్పెపెయుంచు జగంబుదూరగా
నక్కట సృష్టికర్తకీటుల హాయియాడగుచారు నవ్వరే.

అంతనకు

గీ. తమకు ధర్మంబెజయమని తలఁచియెట్టి
కష్టములుగల్గిన సహించి కాలమునకు
గట్టుబడియుండువారి పైకరుణలేక
సంచరించెడుగద పద్మసంభవుండు.

[తండ్రినుద్దేశించి]

తే. ఎల్లవిధముల నాయభివృద్ధి కొఱకై
పాటుఁబడునట్టి నీదురవస్థఁదలఁచి

నప్పుడెల్లను భరియింపనలవిగాని
కష్టమొదవీదు సుఖానకుఁ గలుగుఁ దండ్రీ.

చ. ననునిముసంబయేని విడనాడక నాహృదయంబెచున్నిక్కగా
నీవరిచికూర్మితోడ నిఖిలోపకృతుల్ ప్రచరించునట్టి యా
వనితవిచారమున్ దలఁప వారని దుఃఖముగల్గుచుండు నే
మనివచియింతు నన్భ్రతిగనందుటకా చెలి పాపమెట్టిదో.

చ. నిరతము ప్రాణపంచకము నీపయిబెట్టి ననుస్త మీవెయుం
చరసిచరించు నీపితరులక్కట నీకపరాధ మేమి చే
సిరో యిసుమంతయుఁ దెలియఁ జెప్పకపోయితి త్వద్వియోగమే
కరణి సహింతుమయ్య కొడుకా విధినేమని దూరనేర్తుమో.

మఱియును.—

చ. కొడుకు ననుధుఁడై తమకుఁ గోరినదానినయెల్లఁ దెచ్చి పె
ట్టెడు గదయంచుఁ బేర్మిమొయిలింకిని వీడక యుంటి మిప్పుడి
ట్లిడుమలఁ దెచ్చిపెట్టె విధియేక్రియను దీని భరింపనేర్తుమో
పడఁతియె వాఁడు దిక్కగు నపత్యవియోగముఁ జక్కద్రోయఁగ

అని చింతించు నా తలిదండ్రులఁ జూచు నదృష్ట మీదీనునకుఁ గల్గునో లేదో కదా

తే. కష్టనిష్ఠురములకోర్చి కాయమెల్ల
జీర్ణమైననుగాని నీ నేమమునకె
పాటుఁబడితిగదా యిట్టిపాటుఁగూర్చి
కొనఁద్రోసితె ధర్మమా కానలేక.

(ముందునకుఁజూచి) ఏమది నీలనీరద ప్రభాసన్నిభమైయుగాంత సమయ ప్రకటితమేఘ గంభీర నిఘోషమహాట్లు దిక్కులు బ్రద్దలగ

నట్లగపడుచున్నది ఏదియో? ఘాతుకమృగము కాదుగదా (ఆలోచించి) కాదు కాదు అది సముద్రము గానున్నది. అంట గదిగి యా మహాత్ముని దర్శన లాభంబు జెందెదగాక. పిమ్మట యిట్లనను మంటదియో (అని నిష్క్రమించును.)

(రుద్రదేవుఁడు ప్రవేశించి) సముద్రునుద్దేశించి)

రుద్ర:—

సీ. ఆదివిష్ణునకుఁ గన్యాదాన మొనరించి
వంశద్వయంబు బావనము జేసి
నాకౌన్న దేవతా నీకంబునకు నమృ
తంబు నొసంగి సంతసము గూర్చి
శరణన్నమాత్ర గర్భాయ నీ సోదరు
నభయంబు నిచ్చి భయంబుఁ బాపె
దాక్షాయణీభర్త కతుఁడయుండగుఁ జంద్రు
నిడి సంతసంబలం కృతుని జేసె,

గీ. నే బుహో మహాండమలని నదీశ్వరుని ప
విత్రునకు దర్శనమునఁ గిల్బిషము వాసి
నాకకాంతా పరీరంభణంబుఁ జెంది
యధిక సుఖమొందడే యెవ్వఁడైనఁ గాని

ఆహా పూర్వజన్మమున నెట్టిసుకృతము జేసిననోకదా యీయుదో నాధుని దర్శించు భాగ్యంబు గలుగుట చంద్రమండలము నందుకొన నోయన నూర్ధ్వగాములై యొకదాని వెంట నొకటి విలంబనములేక యెగిరిపడు నీయుత్తుంగ తరంగ మాలికలఁ గాంచిన వాని యభిప్రాయ విశేషంబు నడువ శక్యముగా అవిగో కొంతదవ్వున నీ రత్నాకరేంద్రు నియభంగురమైన సాంగత్యముఁ గోరి నే నేనని రథసంబున భాగీర

ధ్యాది సరిద్రత్నములు వచ్చిపడుచున్నవి. ఈనదీ సంతతికింక యుద్రే
కమెందులకో. (ఇంచుక నేపూరకుండి)

అవును. తే. కావ్యముగు ద్రవ్య మొక్కటిగానఁ బడిన
నవనిజము లెల్ల మాకు మాకనుచు మనసు
నిలుపఁగాలేక ముందంబ సలుపుటది న్వ
భావసిద్ధంబెయగు నబ్రిపడగనేల.

ఈ విరించి ప్రపంచంబునఁ గలుగు విచిత్రంబుల వర్ణింప నాది కవియగు వాల్మీకికిఁ దక్క సామర్థ్యలకు నేర్పుజాలుగా. ఉత్తమకులీనుఁడగు కేసరిత్పతి తన దర్శనంబునకై యరుదెంచిన వారు గౌరవము జేయుటకుఁ గాబోలు వివిధంబులగుఁ బుష్పసౌరభములతో నిజశీకరములఁ గూర్చి మలయ కుమారుని బంపుచున్నవాఁడు. ఉన్నతుల గుణము కిట్టివేకదా (ముందునకు నడచిచూచి)

ఉ. పండుగ వాసరంబులఁ బ్రభాయుతులై తను గొల్వవచ్చు నా
ఖండలము ఖ్యనిర్జర నికాయము నిల్చెడి పట్టలేమొ యీ
రెండతటిఁ దనర్చెడి తదీయపదాంబుజ చిహ్నితంబులై
మెండగు స్వర్ణ రౌప్యముల మేళనమొప్పులు సైకతంబులన్

ఈ మహాత్ముని దర్శనంబు తలవని తలంపుగఁ గలిగినందులకు నాకెంతయు సంతసమేయగుఁగాని నా మంత్రిసత్తముఁడగు ధీవరుఁడైనను నాకు సహాయముగనున్న నీ దినశేషము హాయిగ నిపాంతోద్యానములఁ గడపుదుఁగదా. అయినను వెతకిమూచెదఁగాక (వెదకుచు) (సంతోషముతో) ఏమి మంత్రివర్యుఁడా ఆఁ.

ఆ. నా వ్రతము ఫలించె రాజన్యసార్థక
మయ్యె నన్ను సౌఖ్యమాశ్రయించె

నాకు శ్రేయమయ్యె నాతొలి పుణ్యంపు
మూర్తిఁ దార్చె నాకు మోదమెసఁగ

(అని ధీవరుని కౌఁగిలించుకొనును.)

ధీవ:—మహారాజా! మీరారా సింగంబును దముముకొని వాయువేగంబునఁ బోవుచుండ మీవెనువెంట వచ్చుచు మిమ్ము గలిసి కొనలేక మీకై తిరిగితిరిగి యీ సముద్రప్రాంతంబున నేమైన తమ జాడ తెలియునేమోయని భగవద్ధ్యానము జేయుచు నిట కరుదెంచితిని. నాతప్పు క్షమింపుఁడు (అని పదములపైఁ బడును.)

రుద్ర:—(మంత్రిని లేవనెత్తి) ధీవరా! ఇంక నీదోషమేమి నాతరుణీ రత్నము వలదన్నకొలఁది వచ్చినందులకు మనకుఁ గడుం గష్టములు గల్గినను మహానుభావుఁడగు నీసింధురాజు దర్శనము గలిగిన కతన నవియెల్లను విస్మృతములయ్యె కాని మన సైన్యమెల్ల నేమైపోయెనో తెలియదుగదా.

ధీవ:—తెలియకేమి మహారాజా! సైన్యమునంతయుఁ బురంబున కేగునట్లు నియమించితిగదా.

రుద్ర:—అవును మఱచితిని.

ధీవ:—దేవ! సూర్యుండస్తగిరి శిఖరంబు నలంకరించెను. ఈరాత్రి కిందుశయనించి రేపటిమార్గము వెతకుచుఁ బట్టణంబున కరుగుదము.

రుద్ర:—అట్లేకానిమ్ము (ఇరువురు నందొకచో శయ్యఁ గల్పించుకొని శయనింతురు.)

రుద్ర:—(లేచి కూర్చుండియుండి) అమాత్యా? చూచితివా.

సీ. పతివియోగము సహింపఁగలేక వెతఁ గాంచు
బిస్మాప్సతి కేళిపాళి మనఁగఁ
గువలయేశ్వరుఁడు తన్నాడ వచ్చునటంచు
యామినిక్షైసేయు నంజనమన
తాపింఛ వృతసంతానావృతంబునై
గొనబారు కాటుక కొండయనఁగ
రమణీ జనజయోత్సవము గాంచఁబోయెడి
మనసిజు బండికండెనయనంగ

ఆ. ఖంజరీటకాల కంఠకంఠచ్ఛవి
పుంజమాయనంగఁ బొలుపుఁగాంచి
కృష్ణసపయశ్శోధ విష్ణునిఁగాఁ జేసి
యిరులు గ్రమ్మె జగతినెల్లకడల,

ధీవ:— దేవ! అటుఁజూడుఁడు.

తే. కువలయేశాగమన మహోత్సవము చేత
గగనరమహార్తి కోజ్జ్వల కాలకంచు
కము దొడఁగెనన జలదసంక్రాంత పుష్క
రమునఁ దారావళిదనర్చె రమ్యముగను.

రుద్రి:— (ఇంచుకనే పూరకుండి దక్షిణంపుఁదెసఁ జూచి) మంత్రీ!

తే. పరిమళ బృందనాచల వసుమతీజ
కుసుమ సంతానరజము గైకొనిన కతన
మందగమనుండగుచుఁ బవమానుఁడదియె
సరఁగ వచ్చెడు మనపథశ్రమమునడఁప.

ఆహా! మలయానిలునకు జగత్ప్రాణుఁడను బిరుద మొసంగిన వారెవరో యనుభవజ్ఞులే.

ధీవ:—దేవ! అటుఁజూడుఁడు విరహిణీజనము గణోద్యమమునకై బయలువెడలు పంచశరుని శ్వేతచ్ఛత్రమో యనఁ గ్రమంబున చంద్రబింబమెట్లు ప్రకాశించుచున్నదో.

రుద్ర:—అవును మేనయల్లుఁడగు కందర్పునకు సాయము చేయ వెడలుచున్నవాఁడు కాని నాకాదోషాకరునియందు గౌరవము లేదు. ఏలనందువా?

సీ. ఆదరంబున గమ్ముటంచుఁ బిల్చినయంతఁ
కృత్తివాసుని తలకెక్కినాఁడు
ఆచార్యుఁడై తనకన్ని విద్యలఁ జెప్పు
గురునకు ద్రోహంబు గూర్చినాఁడు
సోదరుఁడని దయజూపుచునుండిన
భగినీగేహము భంగపరచినాఁడు
రాజీతఁడని తమ రాజ్యమొసంగిన
చాకసంతతి పాత సల్పినాఁడు
గీ. క్రూరుఁడై యీచెనఁటి నేతిబీరకాయ
యట్టులిల రాజశబ్దంబు నందినాఁడు
కాకయుండిన సద్గతిఁ గాంచలేఁడొ
యితనిచే బాధపడనివా రెవరుచెపుము.

ధీవ:—అయ్యా! కేవలయోగ్యుండగు నీరోహిణీ పతిని వృథా నిందించుట కామాతురులకుఁ గాక మీవంటివారికిఁ దగునా! ఈమహాత్ముని మూలమునఁగదా సకల జగంబులు సుఖంబుగ మనియుండుట.

రుద్ర:—ఓయీ! శీతకరుఁడను మిథ్యాభిధానంబుఁబూని పదమా మాఖవిమకుంభమల్లెల్ల వారికి విశ్వాసంబు గలిగించి సంతాప

యొనరించు నీశశధరునిపై నీకభిమానమేల? ఇతనిదోసఁగ.

తే. పతుల నెడఁబాసి వెతఁగుందు సతులనబల
అనితలంపక నేచుచు నమ్మయిల్లు
గోలఁగాఁజేసి కనఁగాక కొట్టుచుండు
గలువమతియు గుమారుఁడును గలఁడునుమ్ము.

మఱియును.

చ. అలఘుఁచరిత్రుఁడైన తనయగ్రజుఁ డస్తమయంబు జెందఁగాఁ
గలువమటంచు లోఁదలఁపకఁ జెలరేఁగి సదావియోగినీ
వధీ:-కలితమనస్కుఁడై చెనఁటికర్జములన్ బచరించుచుండు వాఁ
డలసుఁడితండు వీనియెడ నాగ్రహమందిన నాకుఁదోషమే.

దీవ:—(స్వగతము) ఇప్పుడీ మహారాజుగారు విరహావేశంబున లోక నాయకులగుఁ జంద్రమన్మథుల దూరుచున్నవారు. కావున నెట్లైన వీరినీప్రసంగంబునుండి మరలించెదగాక (ప్రకాశముగా) దేవా! నిర్మానుష్యంబులగుఁ దమశాత్రవ నగరంబులఁ బోలి యీయరణ్యము నిశ్శబ్దముగా నున్నయది. మార్గాయాసంబున నలసిన తావిఁంచుక మెత్తని పూసెజ్జలవలె రాలిన పండుటాకులపై నిదురింపుఁడు నేనును శయనించెద

(రుద్రదేవుఁడట్లు జేయును ధీవరుఁడును బవ్వళించును.)

చారుమతి:—(ప్రవేశించి) ఆ పల్లెవాసి దయవలన మొసలి నోటికిఁ జిక్కినను బ్రతికిఁ దరిజేరితిని. ఇట్టిరాత్రింబున నెక్కడకని యేఁగుఁగలను. మఱియు నింకెట్టి కష్టములు గలుగనున్న విదో! ఏమీ యీ తెలివి తక్కున. కోటఁదలఁబెట్టి గోకలి పోటునకు జడియనేల. ఔరా కాలమహిమ !

చ. నిమిషమయ్యేని నన్ను విడువనేరక వ్యాజములేని ప్రేమఁ బ్రా
ణమువలె నాచరించుచును నన్నుఁ జేతులలోనఁ బెంచు నా
రమణుని బాసి యివ్విధి నరణ్యము పాలగుదంచు నెన్నఁడే
నిమాదిఁదలంచినానొ ధరణీశ విధివ్రాఁత నెట్టుంగవచ్చునే.

(బిడ్డలఁ దలఁచుకొని) అయ్యో బిడ్డలారా! మీ కిట్టి నీచపు మరణము సంభవించెను.

సీ. నా ముద్దు చెల్లించి నన్ను బ్రోతురనుకొంటి
నింతలో నిటులౌట నెఱుఁగలేక
నాశ్రమాల నివసించి నాకు సౌఖ్యముగూర్తు
రని యెంచితి నిటులౌట నరయలేక
నాచాకఁ బెచ్చిగడి నాతపఃఫలములం
చిలనంటి యిటులౌట దలఁపలేక
నాయాన జవదాటి యేయాగడము నేయ
రని యెంచి తిటులౌట గనఁగలేక

గీ. అమ్మయని పిల్చి నన్ను మీ రహరహంబు
ముదము జూపుదురనుచు నేమురియుచుంటి
నక్కటా పదియేండ్లప్రాయమున నకపుడె
మరణమాసన్నమగుట మీ కెఱుఁగలేక.

చిరకాలంబునకుఁ గాళికావరంబునఁ గలిగితిరని యెంతయో ప్రేమతో మిమ్ముఁ బెంచుకొనుచుంటినే. అట్టి నాకడుపునఁ జిచ్చు పెట్టి పోయితిరా! మేలిమిబంగారమునకన్నఁ బ్రకాశించు మీ సుందర రూపంబుల నింకనెన్నఁడు గాంచఁగలుగుదును. మిమ్ము దుర్మార్గుఁడు నఱకునపుడు నన్ను గూర్చి యెంత విలపించితిరో గదా. అయ్యో బిడ్డలారా! (అని యేడ్చుచు దిరుగుచుండును)

రుద్ర:—(కన్నులు తెఱచిచూచి) ఏమి యీధ్వని. యెవరో యేడ్చు
చున్నట్లున్నదే మావలె గ్రహముచాలనివారెవరో కదా పాప
ము. కానిమ్ము విచారించెదఁగాక. (అని మెల్లన లేచి చారుమతిని
గాంచి) ఈమె యెవరు. వనదేవత కాదుగదా కాకున్న మను
ష్యమాత్రులీయరణ్యమున సంచరింపఁగలరా? ఆహా ఆ చక్క
దనమేమని వర్ణింపవలయును.

క. స్తనములకు నురముచాలదు
కనుదోయికి మొగముకొంతెగాఁగన్పడెడిన్
ఘనమగు నీసతివేణికి
వెనుకటి భాగంబు తక్కువై యగును జుమీ.

ఏమి యీ తెఱవ చక్కదనము. తృణమాత్రమున నామనంబు
లాఁగికొనినదే. ఇట్టి కాంతారత్నమునకీయరణ్యవాసము గలుగుటకుఁ
గారణమెద్దియో అడిగి తెలిసికొనెదఁగాక. (సమీపించి)

ఉ. ఎవ్వరిదానవీవు నళినేక్షణ నీకులమెద్ది దేనికై
యివ్వనిఁ జేరితీ వెతల నెవ్వఁడు గల్గఁజేసె నాకు నీ
జవ్వనముం గనుంగొనఁగ సంతసమయ్యెడి దేవకాంతవో
ఎవ్వఁడదృష్టహీనుఁడయి యిట్టులనిన్విడనాడెఁ జెప్పుమా.

చారు:— అయ్యా నేనొక యభాగ్యదేవతను నాపురాకృతదోషంబున
మగనిని బిడ్డలను గోలుపోయి చావునకు దూరనై కష్టములకుఁ
దోడికోడలనయి దిక్కులేక తిరుగుచుంటిని.

రుద్ర:—(స్వగతము) ఈకలికి వృత్తాంతము జూడ దిక్కులేనిదిగఁ
దోచుచున్నది. కాన నీకాంత నావెంటవచ్చునేమో తెలిసి
కొనెదను. (ప్రకాశముగా) తరుణీ! నేనొక రాజకుమారుఁడ
నామంత్రియు నేనును మృగయాకుతూహలంబున నరుదెంచి

ప్రొద్దుగ్రుంకుకతన నిందు విశ్రమించితిమి. ఇట్టి యరణ్యముల వెతలఁ గుడువనేటికి. నన్ను బెట్టవట్టి పట్టమహిషివగుదువు నావెంట రమ్ము. మనుష్యలోకంబునఁ బుట్టిన ప్రతివారికిని సౌఖ్యమనునది ప్రధానకార్యముగదా.

చారుమతి:—(స్వగతము) ఎక్కడఁజూచినను నశ్రావ్యంబులగు నీ దుర్వాక్యంబులె వినఁబడుచున్నవి. ఎంతకాలమని యీదరిలేని శోకసాగరంబు నీఁదగలుగుదును! ఛీ యీ యాఁడుపుట్టుక కన్న వ్యర్థమగు జన్మ వేఱొకటి లేదుగదా.

చ. చక్కఁదనంబె యున్న రథసంబునఁ బట్టి భుజంగులెల్లనున్
జిక్కువిధంబులన్ వెతలఁ బెట్టుచునుంద్రు కురూపయైనచో
నక్కట భర్తయొల్లకయుహాసవిశేషముల్ వినుగొంచుచుండు నిం
కెక్కడిసౌఖ్యమేటి బ్రతుకెక్కడి వైభవమాఁడువారికిన్.

(ప్రకాశముగా) అయ్యా! మీవంటి మహారాజులకుఁ బరకాంతలఁ గోరఁదగునా! దుష్టశిక్షయు శిష్టరక్షణము చేయఁదగిన మీరిట్టి కార్యములకుఁ దలకొన్నచో లోకంబు నిలువఁగలదా. జగంబునకుఁ దండ్రులగు మీకు బిడ్డనుగదా. అట్టినన్నుగోరిన పాపంబుగాదే

రుద్ర:—కాంతా! నామనోధనంబు దొంగిలించిన నిన్ను గలిసిన దోషంబు గలుగునా. అట్లు తలపోయకుము. వ్యర్థముగ నీసోయగము నెందులకుఁ బాడుచేసెదవు నాపాణిగ్రహణంబు సల్పితివేని నీకు స్వర్గమున కన్న నెక్కుడు సుఖముఁగూర్తును. నిన్ను గాంచినప్పటినుండియు మదనుఁడదనని పదనగు దూపులచే నావెదనొప్పించుచున్నవాఁడు. నీవాలసించితివేని నాప్రాణంబులు నిలువవు ప్రాణరక్షణముకన్న ముఖ్యమగు కార్యంబొండుగలదా. (అని పట్టుకొనఁబోవును.)

చారు:— ఓరీ! దుర్మార్గుఁడా నన్ను ముట్టరాకుము. రాజ్యమదముచే కన్నుగానక చెడిపోఁదలంపకుము. (కాళికాదేవి నుద్దేశించి) ఓ భగవతీ జగజ్జననీ! కలలోనన్ని నను నీధ్యానము విడవనేని నేను సాధ్వినని నీకు నమ్మకముండునేని యీదురాచారుని సంహరించి నీదాసిని రక్షింపుము (రుద్రదేవుఁడొక బాణము దగిలి నేలఁగూలును చారుమతిఆశ్చర్యమునఁ జూచుచుండును)

భీమదాసు:—(ప్రవేశించి) అమ్మా! సాధ్వీమణీ! దిక్కులేకయీకాననమున నొంటి దిరుగనేమిటి? నీవుజూడ కష్టముల కోర్చు దానవుగావు నేను కాళికాదేవికి భక్తుఁడగాన నీకుఁ బుత్రువంటివాఁడనగుదును నాకుసంతానములేదు బిడ్డలట్లు నిన్నుఁబెంచెద మాయింటికిరమ్ము.

చారు:— తండ్రీ! నీవుచెప్పు మాటలలో యదార్థ మెంతయో నాకు నమ్మకము కలుగలేదు. నన్ను కష్టపెట్టినను సుఖపెట్టినను శాస్త్రదూష్యములుగాని కార్యములకు నియోగించనట్లు ప్రమాణము జేసితివేని మీయింటికి రాఁగలను.

భీమ:— తల్లీ! నీకనుమానమేల నాకులదైవంబగు కాళికాదేవిసాక్షిగ శాస్త్రదూష్యములగు గార్యములకు నిన్ను నియోగించనురమ్ము.

చారు:—(ధైర్యముతో) తండ్రీ! దారిఁజూపుము.

భీమ:— ఇటుఇటు (ఇరువురు నిష్క్రమింతురు.)

కనకశేఖరుఁడు:—(ప్రవేశించి) అయ్యో యీమహారణ్యమున నాసోదరినెక్కడనని వెదుకఁగలను- ముందునకుఁ బోవుదమన్న మార్గముగూడ గానవచ్చుటలేదు— ఆహా వనదేవతలారా! మీరైనను మాతారావళి జూపఁగూడదా? పరస్పరము కలిసికొని

మిట్టమధ్యాహ్న మందైనను జీఁకటి గలిగించు విశాలములగుఁ దరు శాఖలు దట్టముగా నల్లుకొనిన గచ్చపొదలలో గుఱ్ఱున బుసపెట్టి నిద్రించు క్రూరసత్వంబులును కుబుసంబుల విడచి పడగలనెత్తి యాడు కాలసర్పంబులును నా ధైర్యంబునకుఁ గొఱంత గల్గించి యడుగుదీసి యడుగుఁబెట్టుటకు సాహసింప నీయకున్నవి. సోదరీ! నీకాపాపిష్టిదాపామేల గలుగవలయును- కట్టా దైవమా!

ఉ. దప్పియటంచుమూర్ఛవడి దల్లడమందుచు నున్నఁగాంచలే
కిప్పుడెనీరు గైకొని యహీనగతిన్ జనుదెంతు నంచునే
నప్పగిదిన్ జనంగ నెవఁడైననుదుష్టుని లెంకపచ్చి మా
యప్పనుబట్టి చంపఁడుగదా విపినంబునఁబాపచిత్తుఁడై.

సీ. జనియించి నదిమొదల్ జనయిత్రిచెంతల,
నల్లారుముద్దుగ నాడినాము
అహరహం బొకచోట నాటపాటలలోనఁ,
దెరపక కలసి వర్తించినాము
జనకుండు పరలోకమున కేగినప్పుడైన,
నొకరనొక్కరు బాయ కుండినాము
అమ్మను జెఱవట్టి యతఁడు బాధింపంగఁ,
గనులార నొకటియై గాంచినాము
గీ. తుదకు వధియింపఁదలఁచినా దుష్టుఁడనుప
భటునికృపచేత నిక్కాన బ్రతుకఁదలఁచి
వచ్చితిమి నేటికెడఁబాయ వలసివచ్చెఁ
గటకటా సోదరీయెందుఁ గాంతునిన్ను.

(ముందునకునడచిచూచి) అయ్యో ఏమిది దేవదానవులమృతము మథించునెడ సాగరంబునఁ బుట్టిన బడబానలంబుఁ బోలె నరణ్యంబు నెల్లఁగాల్చుచు దావానలంబు నాకెదురుగ వచ్చుచున్నది. హా కాళికా! నన్నీ మంటలోఁ గలిపి బూడిద చేయఁదలఁచితివా? ఇఁక నాకుఁదెరవేది- నన్ను రక్షించువారెవరు.

చ. జనకుని చాపువింటి పెలుచన్ దురితాత్ముని బారిఁజిక్కి హా
యనివిలపించు రాజనని యంగదకోర్చితిఁ దోడునీడవై
యనయము నాకుదిక్కయిన యట్టిమదగ్రజుఁ గోలుపోతిని
తనువిఁకఁదాల్చి యేమి సుకృతంబగు కార్యము నేయుచేర్తునో.

(ముక్కుపై వ్రేలిడుకొని) ఔరా వీరసేనమహారాజుగారి వంశ మింతటితో నంతరించును గాఁబోలు. విధికృతమునకు వేఱు జరుగను గదా. యిట్టి యిక్కట్టులఁ జెంది యొంటికత్తెవలె బ్రతికి నేనే రాజ్య మేలఁగలను. చీ యీపాపుబ్రతుకుకన్నఁ జచ్చుటయే మేలు- (దావానలమునకెదురై) ఓ సర్వపావనా! స్వాహావల్లభా! ఈ నిర్భాగ్యుఁడగు కనకశేఖరుని నీయందు లీనముజేసి పుణ్యము కట్టుకొనుము.

తే. సతముతావక భజనాభి రతిఁజరించు
వారలకుసౌఖ్య మొసఁగి రంభారతంబు
నొసఁగువాఁడవునీవు నన్నుచితరీతి
సరగనాకంబుఁజేర్పుమో జాతవేద!

(అని యగ్నిలోఁబడఁబోవుచు) తెఱలో.

తే. వ్యర్థముగనేల నీతనుత్యాగమునకు
సాహసించెదు వలవదు సకలశుభము

లమరు శాంతింపుమయ్య కష్టములె శాశ్వ
తములుగాఁగలవే ధరా తలమునందు.

కన:—(ఆలకించి ఆశ్చర్యముతో) ఈపవిత్ర మూర్తియగు హవ్య వాహనుని కావలిగానున్న నన్నవరా వారించువారు (విదానించి) ఈపలుకు లిట్టి నిర్జనారణ్యంబున వెలువడఁ గారణమేమి. (ఆకసమువంకఁ జూచి) భగవతియగు నశరీరవాణి గాఁబోలు వారించుచున్నది. ఇట్టి దురంతచింతా సాగరంబునఁ గొట్టుకొనిపోవు నాకెట్టి శుభము గలుగఁగలదు. తండ్రియా దుష్టబుద్ధివలన దేహంబువాసెను. తల్లి యా గొప్ప విపత్తున మునిఁగెను. భగినియా! యిక్కాన నేమృగము వాతనోపడి మరణించి యుండనోపు రాజ్యమా శత్రువుల పాలయ్యె ఇం కెక్కడి సుఖము. ఎక్కడి బ్రతుకు. ఇదియంతయు వట్టిమాటయే అయినచో భగవతివచనంబు లసత్యములా. అయ్యో సందిగ్ధావస్థగలిగెనే ఏమిచేయుదును. చేయునదేమున్నది. అన్నిటిని సహించి యుండుటయే ఇప్పటికీ దవానలము చల్లారినది. నాసామర్థ్యము కొలఁది వెతకి చూచెదఁ గాక.

(అని నిష్క్రమించును)

తృతీయాంకము

సమాప్తము,

---



శ్రీ

మీనాక్ష్యై నమః.

# విషాదకనకతారీయము.

## చతుర్థాంకము.

కనకశేఖరుఁడు:—(ప్రవేశించి)

చ. కనుఁగొన నేర్చువారలకుఁ గన్పడుఁ జక్కని రూపుశోభనం
దునఁ గొలఁగానియజ్ఞులకుఁ దోఁచ సోకించుకయుంన్ గుణాత్ముఁడై
తనరియుఁ దద్విహారుఁడయి తర్కములన్ బొడఁగట్టు నవ్విఁడా
యనఘుని నిర్వికారుని మహాత్ముని నాత్మ నమస్కరించెదన్

మ. తనకాధ్యాత్మిక విద్యయే సకల తత్త్వజ్ఞానముం గూర్పనం
దునకీ సౌఖ్యము లేటికీ తనువు సద్యోజాతమై యుత్తరం
బున నాశంబగుగాదె లోకమనుచున్ మోహంబుఁ జెండాడనే
మనుజశ్రేష్ఠుఁడు భూమికీన సిరియున్మత్కార్యమున్గూర్చెదన్

ఆహా సకలంబు నిశ్చలంబును నిర్మలంబునై కానవచ్చుచున్నది. గర్హితము కాదనియె తలఁచెదను. సహస్రకిరణుండుంబోలెఁ దమో

భంగముగావించు కర్మసాక్షిని దివాంధము దూరిననేమి భూషించిన నేమి అయినను నడుమ నడుమ నంధకారముతలయెత్తుచునేయున్నది. దాన నష్టములేదు. ఎవ్వండైనను మల్లెలనీ రుబోయును గాని వల్లెరునకుం బోయుంనుగదా ఇది రాత్రియా పగలా ఏదియునుగాదు. ఇది యొక మాయ. కలగాను గదా ఇది జాగ్రదవస్థయే దుష్టబుద్ధి కతన మా తలిదండ్రు లంతమొందుటయు వేటమూలమున రుద్రదేవుండడవికిం బోయి యంధకారణంబునం జచ్చుటయు నొక మహాకార్యోద్ధరణము నకే నేం డొకదవానలంబునం బడంబోవు నపుడు భగవతియగు న శరీరవాణి వారించెనుగదా. అంకుల కింకరుండి పౌరులచే నియమింపం బడిన యేనుంగు నామెడలో హారము వేయుటయే ఫలము, దాన గదా, నాకీ పట్టణమంతయు స్వాధీనమగుటయు సంభవించినది. కాని నాకు మనోవ్యథ మాత్రము హెచ్చుచున్నది. ఏలనన తలిదండ్రులు గాన వత్తురను కోరిక యీజన్మమున ఫలించదనుట నిక్కమే. భగిని యైన బ్రతికియున్నదో లేదో పది దిక్కులకు భటులంబంపి వెదకించెద.

తే. ఉచితమగుం బ్రతిక్రియసల్పి యొనరినట్టి
కష్టములందీర్చి కొనవలెం గాకరి త్త
వంతం గుందంగ నేల శాశ్వతము లగునె
యరయ సుఖదుఃఖములె వారికైనం గాని.

కావున సత్వరమసోదరి నన్వేషించుటకై యత్నించెదంగాక
(నిష్క్రమించును.)

తార:—(ప్రవేశించి) అయ్యో! దైవమా! ఇంక నాకుదిక్కెవ్వరు కొండలందును గుహలందును వనములందును వెదకితిని మా కనక శేఖరుండెందునను గానంరాడు ఏమిచేయుదును.

మ. అకటా దాహము దాహమంచవుడు నేనారీతి మూర్ఛిల్లఁగా
నికటంబోణికి నీటికై యఱిగి యెంతే గష్టముం జెందితో
కకు బంతిల్లుల నన్ను గానక యదుఃఖంబూని యేరీతి బ్రు
గ్కుక ప్రాణంబులతోడ నుంటివో యెటులం గన్ రాదుగా తమ్ముఁడా

ఉ. పుట్టిన దాదిగాఁ గలిసి పుణ్యము పాపము చేసినార మె
ప్పట్టున నైనఁగాని యెడఁబాయక యొక్కటిగా మెలంగి నా
పుట్టియవస్థలన్ని గుడుచు నన్నును గాంచి సహించి నేటికి
నట్టడవిన్ బురాకృతమువన్ విడిపోయితివయ్య సోదరా !

ధీవ:—(ప్రవేశించి) ఎవరు వారు !

తార:—అయ్యా నేనొక దిర్భాగ్యురాల!

ధీవ:—నీవీ యడవి కేలవచ్చితివి నీతలిదండ్రు లెవరు.

తార:—అయ్యా నాకథయంతయు నొక పురాణమున కన్న పెద్దది కావున నిదానముగఁ జెప్పెద నాకుఁ గొంచెము ప్రసాదముఁ బెట్టి నాప్రాణముల నిలుపుము

ధీవ:—అమ్మా నావెంటరమ్ము మాగ్రామము కొలఁది దూరమున నే కలదు. అందునీకు శుభముచేకూరఁ గలదు.

(ఇరువురు నిష్క్రమింతురు.)

రామసింగు:—(ప్రవేశించి)

చ. చిలుకలుఁ గోరువంకలును జెన్నగుఁ గోయిలలంచపిండులున్
గొలువ వియోగులన్ వెతలఁగుందెడునట్టులు జేయఁగోరియా
మలయసమీరు వెంటఁగొని మక్కువవచ్చుచు నున్నవాఁడు పూ
విలుతుఁడు నేఁడు నాకిటఁ బ్రవేశముకూడదు కష్టమయ్యెడున్.

కావున మరలిపోయెదఁగాక (పోఁబోయి) అఁ మరచితిని.

నా ప్రియ తమయగు రాధ నన్నుద్యానవనమున నుండుమని కదా కోరినది పాపమా తరుణికి నాతోఁగూడ నిందలి వసంతశోభ నీక్షింపవలయునని యెంత వేడుకగా నున్నదో నేనా యబలప్రార్థన నేలఁద్రోసి వేయవలయును. నేనొక్కఁడనై నఁ గదా మదనునకు భయ మొందవలయును క్షణములో నా రాధ రానే వచ్చును. ఇఁక సందేహ మొందుటకు.

(ఉద్యానవనమునఁ బ్రవేశించి పరిక్రమించిచూచి) చిగిరించిన గున్నమావులును ఫలభార వినమ్రములై యున్న తులగణము లిట్టి వని తెల్పు నీపనసలును మృదువులై మనోహరములగు నీకదళీ తరువు లును విశాలములగు నీకొలఁకులదరి యిసుకతిన్నెలును నాజీవితము నానోముపంట నాబంగరుబొమ్మ నారత్నభాండమగు నాముద్దుల రాధను తలంపునకుఁ దెచ్చుచున్నవి. (తో్రవకై వీక్షించి) క్షణ ములో వత్తుననిగదా నాతోఁ జెప్పినది. ఇంతయాలస్యముఁ జేయుటకుఁ గారణ మేమైయుండును. (అని చూచుచుండును.)

రాధ:—(విచారముతోఁ బ్రవేశించును)

రామ:—(చూచి) నాజీవితమా! వచ్చితివా రమ్ము. (అని కౌఁగిలిం చుకొని) సఖీ యింతయాలస్యమున కేదాసుఁడోర్వఁగలఁడా.

రాధ: —(పలుకకుండును.)

రామ:—(రాధముఖమెత్తి) కాంతా పలుకవేమి నీకు విచారమేల.

గీ. శరదమలచంద్ర బింబంబు సరణినలరు
నీముఖంబదియేలొకో నీరజాక్షి
మంచులోనున్న పద్మంబు మాడ్కిచెన్ను
దొఱఁగియున్నది నాకిపుడెఱుకపఱవు.

రాధ:—(కన్నీళ్ళు విడుచును) నాథా ! యేమనిచెప్పుదును.

రామ:—తరుణీ ! నాయందనుండిన నీకుఁ గొఱంతయేమి.

రాధ:—ప్రతీకారశూన్యమగు నపరాధవ్యసనము మీకుఁ దెలిసినట్లు కేమిఫలము.

రామ:—ఫలములేకేమి చెప్పుము.

రాధ:—(తనలో నాలోచించుకొని) ఈపన్నుగడబన్నదను (ప్రకాశముగా) మీతోఁగలసి యీనూతన వసంతశోభ నీక్షింపవలయునని వేడుకపడి మిమ్మిటకంపి యాక్షణమే వచ్చుటకై యలంకరించుకొనుచుండ మృత్యుదేవతవలె నాయింటనున్న దాసి నన్ను గాంచినది.

రామ:—ఆదాసి చూచిననేమి. దాసివలన భయము శంకింప నవసరములేదే. అది యిట్టి విషయములలోఁ బనిగల్గించుకొనదు. నేనెఱుఁగుదును

రాధ:—అయ్యో మీరు దానిని గౌరవింతురేల. ఆదుష్టదాసివలననే యింతమూడినది.

రామ:—(కోపముతో) ఆ నిన్నేమయిన నాటంకముజేసెగా.

రాధ:—అట్లయిన బాగుగనే యుండును.

రామ:—అట్లుగాక మఱేమిచేసెను.

రాధ:—అప్పుడే యన్యగ్రామమునుండి వచ్చుచున్న నాపతి కెదురేఁగి మన రహస్యమంతయు బూసగ్రుచ్చినట్లు చెప్పినది

రామ:—ఏమీ యింతపని జేసినదిగా (కోపముతో) ఇప్పుడే పోయి యాదుష్టదాసిని సంహరించి వచ్చెద. (అని పోఁబోవును)

రాధ:—(చేయిఁబట్టుకొని) మనోహరా! తీవ్రపడకుఁడు జరిగిన కథనెల్ల వినుఁడు.

రామ:—తరువాత.

రాధ:—నన్ను మ్రింగునంతటి రోషము గల్గినను లోలోన నణఁచుకొని నన్నొక యంధకార బంధురమైన గృహములో బంధించినాఁడు.

రామ:—అబ్బా నీవాదుష్టురాలివలన నెంతకష్టమొందితివి.

రాధ:—నేనప్పుడందలి గవాక్షమును బగులఁగొట్టుకొని యెవ్వరికంట బడకుండ ప్రాణములఁజేతఁ బెట్టుకొని వచ్చితిని

రామ:—(విచారముతో) సరే ప్రస్తుతము చేయఁదగిన కార్యమేమి?

రాధ:—మీకు దెలియదా

రామ:—అట్లుగాదు చెప్పుము ప్రియురా (అని వెన్నుజరచుచు.)

రాధ:—క్షణక్షణమునకుఁ జెప్పుచుండవలయునా.

రామ:—నీపలుకులు నాకు స్పష్టముగాఁ దెలియుటలేదు. చెప్పుము.

రాధ:—ఆనాటి సాయంతనమునఁ జెప్పినది మఱచితిరా!

రామ:—(స్మృతినభినయించి) జ్ఞప్తికి రాలేదు.

రాధ:—(చెవిలో నేదియో చెప్పును.)

రామ:—తప్పక చేయవలసినదే.

రాధ:—నాకుఁ జేసిన పరాభవమున కదియే ప్రతీకారము.

రామ:—అయిన నీవఱిగి నాకై వేచియుండుము.

రాధ:—(నిష్క్రమించుచు.)

రామ:—(తనలో) అయ్యో! అజ్ఞాతయుణి యెట్టి కార్యము నామీఁదఁ బెట్టినది. పాపము నకెల్ల భైరవుఁడనైతినే. ఇదివఱకెన్నియో

సార్లు నాకీపనిబెట్టి వారించితినిగాని నేటికి తప్పక చేయవలసి వచ్చెను.

చ. తనకుఁ బరోపకారమె సతంబొక కజలముగాఁగఁ జేయుచున్
దనరెడివాఁడు దుష్టులు వృథాతను దూరినఁగాని పల్కకన్
జనిచెడి శాంతమూర్తి పరుషంబులఁ బల్కకయుంగనట్టివాఁ
డనఘుఁడు శ్రీక దాసెటుల నాతనిఁ జంపఁగ నేర్తు రాధకై

ఆవ. ఉద్దృశ్య పరివంచమునందు

చ. కలుషమెయైనుగాక ♦ జనకంటకమయ్యెడుగాక దల్లిదం
డ్రులు తలవంపునన్ ♦ దన పరోక్షమునం దెచరింత్రుగాక ని
చ్చలు తమ భర్తనేలియుడు ♦ జంపుటకున్నను దీయరాత్మలో
వలచిభుజంగులన్ గలసివర్తిలు ♦ కాంతలు పెక్కుభంగులన్.

ఎట్లయిన నేను తప్పక జేయవలసివచ్చునప్పుడీయనర్థక విచారము లెందుకు. ఇది లోకవిరుద్ధముగాదుగదా.

చ. కులమునకప్రతిష్ఠయైనఁగూడిన ♦ గాని తదీయబాంధవుల్
చులకనజేసియూతనిని ♦ జూచినఁగానిన్ను పలుఁదాత్మలో
నలఁగినఁగానిమారుని సితాంబక ♦ పాలికి జిక్కినుక్కితాఁ
గలసినపూవుబోఁడియెడ ♦ గౌరవముండకపోదెవానికిన్.

కావున నవశ్యము రాధకై గా నియోగమును నెరవేర్చవలసినదే (అని నిష్క్రమించును)

4 వ రంగము అంతర్భవనసమీపము.

భీమదాసు:—(ప్రవేశించి) పాపమా సాధ్వీమణి మాయింట బ్రవేశించినదిమొదలు నాయందు బితృభావమున నాయానజవర్తనక బ్రవర్తించుచున్నది. నేనును నాకూయందు విశేషముగ దయ

గలిగియేయున్నాను. కాని నాభాగ్యమాత్రమిూదాసి మన యింట నుండక, గఱపకాలము గదా. రాజడితగ్గినప్పుడితరు లభరించుట కష్టతరమని నాకప్పుడప్పుడు బోధించుటయగాక నాదీనురాలియెడఁ గసరుకొనుచున్నట్లుగూడఁ దెలియుచున్నది.

తనబిడ్డనెత్తి పెంచుచుఁ దన కన్నివిధములఁ బనిపాటలందు సాయముగు నాకొను వెడఁగొట్టువానుటకునుఁ గోపించుటకును గొప్ప కారణ మేదియో యుండవలయును, అది నాకుమాత్రము దెలియుట లేదు. ఏది యెట్లున్నను నాప్రాణముండువఱకు నీకేవిధమైన యపచారము జేయక రక్షించెదనని గదా యామె నరణ్యమునుండి తెచ్చితిని. అట్టి దిక్కులేనిదానిని వంచుబుద్ధిగల రాజ్ఞకై విడచుట ధర్మమా. సాటివారు నగరా. మాతాతతండ్రులనాటినుండి వచ్చుచున్న కీర్తికిఁ గళంకము గలుగదా.

చ. తనధనమెల్ల గోల్పడిన దారసుతాదులసహ్యమొందినన్
దనువు గృశించినన్ హితులుతప్పని దూరిన రాజు కోపగిం
చినను మఱేమియైన దనుజేరి యనాథులనుంచు వేఁడువా
రిని యభయంబొసంగియు ధరిత్రి వృధా విడనాడుటొప్పునే.

అందువలన నాతపస్వినిని విడక మునుపటికన్న దయతో మాతృభావమున రక్షించెదను. (కొంచె మూరకొని) నేఁడేలనో విశేషము రాత్రి కాకపూర్వమే కనులు గుజ్జుకొని పోవుచున్నవి. కావున నంతర్భవనమున కఱిగి శయనించెదను (అనినిష్క్రమించును)

5 వ రంగము న్యాయస్థానము.

(అంకట కనకశేఖరుఁడు, మతిమంతుఁడు, శోధనకుఁడు, ప్రాడ్వికుఁడు, దాసి రాధ సేవకుఁడు యాకూబు ప్రవేశింతురు.)

కనక:—అమాత్యా! ఆలస్యమేల నేరమును విచారించుటకుఁ బ్రయత్నింతము

మతి:—చిత్తము మహారాజుగారియాజ్ఞ (అని ప్రాశ్నికుని జూచును)

ప్రాశ్ని:—(రాధనుజూచి) అమ్మా నీవీ బోనులోని కెక్కి నేనడుగు ప్రశ్నములకు యథార్థమగు నుత్తర మొసఁగుము.

రాధ:—అయ్యో దైవమా! కలనేనియు బరపురుషులతో మాటాడి యెఱుఁగనే అట్టి నాకీదాసిమూలమున పతివియోగము గల్గుట గాక మహారాజుగారి యెదుర లజ్జవిడచి మాట్లాడవలసి వచ్చెనుగదా. (అనియేడ్చును)

ప్రాశ్ని:— ఏడ్చిన లాభమేమి నేనడిగినదానికెల్ల సదుత్తర మీయవలసినదే.

రాధ:—(బోనులోని కెక్కును.)

ప్రాశ్ని: — దేవుని యెదుట బ్రమాణము జేసి నిజము చెప్పెదను అబద్ధము చెప్పను.

రాధ:—(ఏడ్చుచు) నాయనా! ఎల్లప్పుడును నాకు రెండవప్రాణమైనా మేలుగోరు భర్తను గోల్పోయి పుట్టెడు దుఃఖములోనుండియు నిజము చెప్పక యబద్ధమే చెప్పెదునా అబద్ధమాడి యింక నేనుఖమును బొందఁబోదును తండ్రీ!

ప్రాశ్ని:—నేజెప్పినట్లు కంఠమెత్తి చెప్పుము.

రాధ:—దేవుని యెదుట బ్రమాణముజేసి నిజము చెప్పెదను. అబద్ధము చెప్పను.

ప్రాశ్ని:—మీకులమేది?

రాధ:—శెట్టికులము.

ప్రాశ్నిః—నీపేరు.

రాధః—రాధాబాయి.

ప్రాశ్నిః—నీభర్తపేరేమి?

రాధః—(స్వగతము) అయ్యో నాపెండ్లివాడుకూడా అత్తాలంచుబిడ్డలు తోడికోడండ్రు ఎంతో అచ్చట ముచ్చటగా ఆయనపేరడిగితే చెప్పటానికి సిగ్గౌండే యిప్పుడింతమందిలో సిగ్గువిడచి యెట్లా చెప్పేది. (అనియూరకుండును.)

ప్రాశ్నిః — చెప్పవలసినదే మౌనముం బూనిన సాగదు.

రాధః— (మెల్లగా) భీమదాసుగారు

ప్రాశ్నిః—వయస్సు.

రాధః—అయ్యోతండ్రీ యెన్నోయేండ్లు వచ్చిందాకానా చిన్నతనం లోనే నాకాపురం చిచ్చుపెట్టిపోయినారు.

ప్రాశ్నిః—నీభర్త వయస్సుగాదు. నీవయస్సు.

రాధః—నాకుమట్టుకేండ్లెక్కడివి నాయనా. పోయిన బందరుప్పెనకు యిరువైయేళ్లో మూడరెండ్లో అని మావారు చెప్పుచుండే వారు. యిప్పటికీ దాసినూలాన నీరాత రాసిందిగాని.

ప్రాశ్నిః—మీకు జీవనమేమి.

రాధః—ఇప్పటివరకు వారే తెక్కల కష్టముమీద యింతో యంతో తెస్తుంటే జరుగుచున్నది. ఇంకమీద నాబ్రతుకెట్లు తెల్లవారునో తెలియదు.

కనకః—(వ్రాయును)

ప్రాశ్నిః—(దాసిని జూచి) ఈమె కులగోత్రములు నీకేమైనం దెలియునా.

రాధ:—తెలియవు.

ప్రాశ్ని:—నీవడుగలేదా. అడిగినను దాసి చెప్పలేదా.

రాధ:—ఎప్పుడైన నడిగినచో దుఃఖించుచుండెడిది. అందులకు మా
వారు నన్ను నివారించుచుండువారు.

ప్రాశ్ని:—ఈమె మీయింటి కెట్లుచేరినది.

రాధ:—ఒకనాఁడు నాభర్త వేఁటకైపోయి యడవిలో దిక్కులేక
పడియుండ జాలిచేత మాయింటఁ బనియైనఁ జేయుచుండునని
తలఁచి తీసుకవచ్చినాఁడు.

ప్రాశ్ని:—నీభర్త వేఁటయు జేయుటకలదా.

రాధ:—పనితీరిక గల్గినప్పుడెల్ల వేటకై పోవుచుండువారు.

ప్రాశ్ని:—ఇంకా నీ భర్త యే యే పని చేయును.

రాధ:—మావారికి వేఱు పనులేమి లేవు

ప్రాశ్ని:—మీయింటియందు వేటసామగ్రి సంపూర్ణముగఁ గలదా.

రాధ:—ఆ సమగ్రముగనె యున్నది.

ప్రాశ్ని:—కత్తులు కటార్లుకూడా కలవా?

రాధ:—వానితో మావారి కవసరములేదు.

ప్రాశ్ని:—ఈదాసి మీరుచెప్పిన పనిపాటులు బాగుగఁజేయుచుండునా?

రాధ:—వచ్చిన కొన్నిరోజుల వఱకుఁ జేయుచును యుండెడిది

ప్రాశ్ని:—కొన్నిరోజులనఁగా నెన్నిరోజులు.

రాధ:—మాయింట జేరిన నెలరోజుల వఱకు.

ప్రాశ్ని:—తరువాత మీరు చెప్పినమాట వినకేమి జేయుచుండెడిది ?

రాధ;—ఇరుగుపొరుగువారితోఁ బరిచయముచేసికొని ప్రొద్దుగడుపు
చుండెడిది.

ప్రాశ్ని:—ఈదాసియందు నీభర్తదయతోనుండునా యథోచితముగా?

రాధ:—వారిమాట విన్నంతవఱకు దయగానే యున్నారు. తరువాత మాత్రము చూచి చూడనట్లుండెడివారు.

ప్రాశ్ని:—ఎప్పుడైన కోపముచేసియుండునా యీమెను నీభర్త.

రాధ:—ఒకటి రెండుసార్లు పొరుగిండ్లకుఁ బోవలదని చీవాట్లు పెట్టిరి గాని దాసి వినలేదు.

కన:—(వ్రాయును)

ప్రాశ్ని:—ఈదాసికి నీభర్త యెడలఁగాని నీయెడలఁగాని యేవిధమైన గాని కోపమున్నట్లు నీకుఁ దెలియునా?

రాధ:—కొన్ని దినములనుండి నాభర్తనుగాని నన్నుగాని జూచినపు డెల్ల పెడమొగము పెట్టి లోలోన నేదియో గొణఁగుకొను చుండెడిది.

ప్రాశ్ని:—అందులకు గారణమేమియో నీవు చెప్పఁగలవా?

రాధ:—ఏలచెప్పలేను. ఇరుగు పొరుగునయున్న మావిరోధుల దుర్బోధలే దాసికోపమునకుఁ గారణము.

ప్రాశ్ని:—ఈవిషయమై నీవుగాని నీభర్తగాని జోక్యము గలిగించు కొంటిరా?

రాధ:—నా భర్త నిన్నటి యుదయమున నీదాసిని మాయింటనుండ వలదని చెప్పిరి.

ప్రాశ్ని:—దానికి దాసి యేమిచెప్పినది?

రాధ:—మాట్లాడలేదు.

ప్రాశ్ని:—కడచిన రాత్రి నీవింట నుంటివా?

రాధ:—ఇంటిలోనే యుంటిని.

ప్రాశ్ని:—ఈదాసి కూడయున్నదిగదా.

రాధ:—లేదు.

ప్రాశ్ని:—లేకెక్కడికి పోయినది.

రాధ:—తెలియదు.

ప్రాశ్ని:—ఈదాసి రాత్రింతలఁగూడా నెక్కడికైనఁ బోవుటకలద.

రాధ:—ఒకరాత్రియు నొకపగలనియులేను, ఆమె యిష్టము వచ్చినట్లు సంచరించుచుండును.

ప్రాశ్ని:—నేరము జరిగినరాత్రి మీయింట నెవరెవరుండిరి.

రాధ:— నాభర్తయు నేనును నాచంటిబిడ్డయు నీదాసియునుంటిమి.

ప్రాశ్ని:—వేఱెవ్వరును లేరా.

రాధ:—లేరు.

ప్రాశ్ని:—ఈదాసి నీమగనిఁ జంపినప్పుడు నీవుదగ్గఱనున్నావా.

రాధ:—నాయనా నేనక్కడనున్న నాభర్తను జంపుచుండ నూరకుందునా.

ప్రాశ్ని: —అయినచో నీదాసియే చంపినదని నీవెట్లు చెప్పఁగలవు.

రాధ:—నేనా రాత్రి యించు మించుగాఁ బదునొకండు గంటలకు నప్పుడు పాకశాలలో సామానును సదిగాలే యనింతము గదా యని గర్భగృహములోనికిఁ బోవుచుండనీదాసి నాభర్త పడుకొనియున్న యంతర్భాగము నుండి వచ్చుచు నాకెదురైనది. అప్పుడు నేనీ దాసినిఁజూచి యేమే ఎన్నఁడును లేనిదీ యర్ధరాత్రమున నొంటరిగ నీ లోపలి కేలవచ్చితివి నిన్నెవ్వరు పిలచిరని యడుగుచు నంతర్భవనములోనికేఁగి చూచునంతకు అయ్యో జీవితేశ్వరా నన్నాధను జేసిపోయితివా. హా నాకు దిక్కెవరు (అనియేడ్చును.)

ప్రాశ్ని:—దుఃఖంపకుము జరిగిన దానికెవరేమి చేయుదురు.

రాధ:—నాభర్త తలతెగి రక్తము ప్రవహించుచున్నది.

ప్రాశ్ని:—అయింటి యందప్పుడు మరెవ్వరు లేరా.

రాధ:—(కన్నీళ్ళువిడచుచు) లేరు.

ప్రాశ్ని:—తరువాత నీవేమి చేసితివి.

రాధ:—నేను రొమ్ముబాదుకొనుచు వీధిలోనికిఁ బోయితిని.

ప్రాశ్ని:—అప్పుడు దాసి యేమిచేయుచున్నది.

రాధ:—తన చేతుల కంటిన రక్తము కడిగికొని వీధిలోనికివచ్చి దొంగయేడ్పు రోదువసాగినది.

ప్రాశ్ని:—వీధిలో నెవ్వరైన నుండిరా యప్పుడు.

రాధ:—(యాకూబునుజూపి) ఈసాహేబుగారు మాత్రముండిరి. తర్వాత నిరుగు పొరుగువారు గుమిగూడిరి.

ప్రాశ్ని:—ఇఁకనీవు బోనునుండి దిగుము.

రాధ:—అయ్యా! దిక్కులేనిదానను రక్షింపుఁడు. (అని యేడ్చుచుఁ బోనుదిగును)

కనక:—(ప్రాశ్నికునిజూచి) ఇఁక యాకూబు సాహెబును విచారించుఁడు.

ప్రాశ్ని:—యాకూబ్ నీవు బోనులోనికెక్కి నేనడుగు మాటలకుఁ దెలిసినంతవఱకు నిజము జెప్పుము.

యాకూబ్:—(అందఱికి సలాముజేసి) బోనులోనికెక్కును.

ప్రాశ్ని:—దేవునియెదుట ప్రమాణము జేసి నిజము చెప్పెదను.

యాకూబ్:—దేవుని యెదుట ప్రమాణముచేసి నిజముచెప్పెదనూ.

ప్రాశ్ని:—అబద్ధము చెప్పను

యాకూబ్:—అబద్ధం సెప్పనూ.

ప్రాశ్ని:—నీ దేకులం.

యాకూబ్:—ఈ దీఖులం ముసల్మాన్ఖులం.

ప్రాశ్ని:—నీ పేరేమి

యాకూబ్:—నాకీపేరూ సయ్యద్ యాకూబ్ సాహెబ్.

ప్రాశ్ని:—నీకు జీవన మేమి.

యాకూబ్:—మేమూ పోలీస్ ఉద్యోగంవళ్ళ జీవనంసేస్తె.

ప్రాశ్ని:—నీకీరాధాబాయి తెలియునా.

యాకూబ్:—దెల్సునూ.

ప్రాశ్ని:—ఎట్లు దెలియును.

యాకూబ్:—భీమదాసుగార్కి భార్యాఘాముండీ.

ప్రాశ్ని:—నీకీనేరము విషయమై యేమి తెలియును. ఎట్లు దెలియును. ఎప్పుడు జరిగినదని తెలియును

యాకూ:—మహారాజ్ మేమీరాకల్ గారాబజెరక్ ఖాగానేసీ షామ్ మే ఘుస్తీకి బయల్ దేకీ ఘూంధీచాక్ ఖాడీకి వచ్చేతల్కి (దాసిని జూపి) యీరాజారత్ రాతుసీలాగా ధాడ్ సేస్తా మాకీయెదురుగా వచ్చింది. మేమ్ సూసి ఆతుర్యంపోయి కోణ హైతుమ్ ఇంత అర్ధరాత్రింఖాడా యెఖడ్కి ధాడ్ సెస్తావుండావ్ నీకీసూసి దొంగఅని మేమ్ తలుస్తామ్ ఘుస్కా కానాకుచలోఅని సెప్పినాం. అప్డు యీ సైతాన్ దాని దుఃఖంసెస్తూ మేమూ దొంగకాదు. భీమదాసు ఘుర్కేపాలుండె దానీవారం డాక్టర్ సాహెబ్ కా ఘుర్ సెదవా తెస్తూ వుండామ్ అని చెప్పింది. అంధ్కు మేమూనిజము తలచి వున్కు చోడిదియా. తర్వాత ఆదా ఘుంటకు భీమదాసునుక్ ఖాడ్కిపోయి సూసెతల్కి రాధా

బాయి ధర్మాణాఖాడా నా మగడ్ మర్గయా అని యేడ్వసా గింది. అప్పు మేమ్ అచ్ఛాధర్మాలేద్ అని సెప్పి లోపల్కి పోయి సూసినాం. భీమదాస్ ఖత్రితో పొడ్చి సంపినట్టుగా పడియుండాడ్.

ప్రాడ్వి:—ఆనేరమెవ్వరు చేసినట్లు నీవు నిశ్చయించితివి.

యాకూ:—తర్వాత పార్ఖీపిర్ఖీ పిల్చి జమాబందీసేసి ఆకేస్ యీదా సీదిచేసినట్లు నిశ్చయించినామ్.

ప్రాడ్వి:—ఎట్లు నిశ్చయించితివి ?

యాకూ:—అంతకు మున్పు ఆదఘంటఖాడా మాకీ యీదాసి యెద ర్ఖావధం తర్వాత భీమదాస్ ఖర్మ్ ఖుందర్ ఖూనం కావటం యీదాసీ వాంగ వాంగ యేడ్పులు చెయ్యటం విచారించి యీకేస్ దీనివళ్ళనే ఝరిగినాదనుకుని తెల్సుకున్నామ్.

ప్రాడ్వి:—ఇంక నీకెవ్వరు సాక్షులు లేరుగా [అని రాధనడుగును.]

రాధ:—ఎవరైన జూచిన నిట్టి కర్మము నాకుం బట్టు నా తండ్రీ.

ప్రాడ్వి:—[యాకూబును జూచి] నీవింక బోనులోనుండి పోవచ్చును.

యాకూ:—(సలాము జేసి) మహారాజ్ యీకేస్ దాసియే చేసింది నిశ్చయం నిశ్చయం (అని బోనుదిగిపోవును.)

కనక:—(వ్రాయును )

ప్రాడ్వి:—(దాసిని జూచి) నీవీబోనులోనికెక్కి నేనడిగిన దాని కుత్తరమొసంగుము.

దాసి:—(తనలో దైవమా యెంతగతి గల్గించితివి అని బోనులో కెక్కును.)

ప్రాడ్వి:—(ప్రమాణము జేయించి) నీదేశ గ్రామము.

## చతుర్థాంకము.

దాసి:—ఇప్పటికిదియే గ్రామము.

ప్రాశ్ని:—నీపేరేమి.

దాసి:—ఇప్పుడు దాసియని పేరు.

ప్రాశ్ని:—నీభర్త పేరు.

దాసి:—అదినన్నడుగుట యనవసరము.

ప్రాశ్ని:— నీవీగ్రామమునఁ బ్రవేశించి యెంతకాలమైనది.

దాసి:—సుమారొక సంవత్సరము కావచ్చును.

పాశ్ని:—నీవీగ్రామమున బ్రవేశించి యెంతకాలమైనది.

దాసి:—సుమారొకసంవత్సరము కావచ్చును.

పాశ్ని:—ఇంతకాల మెక్కడనుంటివి.

దాసి:—భీమదాసుగారి యింట.

ప్రాశ్ని:—నీవు వారింట నేమిచేయుచుందువు.

దాసి:—పాచిపనివగైరా చేయుచుందును. అప్పుడప్పుడు (రాధను జూచి) ఈయమ్మగారి బిడ్డ నెత్తుకొందును.

ప్రాశ్ని:—భీమదాసైనను రాధాభాయియైనను నిన్ను దేనికైన కోపించుట కలదా.

దాసి:—హరిహరీ. నన్ను కోపించి యెఱుఁగరు.

ప్రాశ్ని:—వారిమీఁద నీకుఁగోపము గలిగినదా. ఎప్పుడైన

దాసి:—కూడుగుడ్డ నిచ్చి తమ బిడ్డవలె నన్ను బోషించుచున్నవారిపై నాకుఁ గోపమేలకలుగును.

ప్రాశ్ని:—నీవెప్పుడు నింటనే యుందువా లేకెక్కడకైన బోవుచుండుటయుఁ గలదా.

దాసి:—నాకొకచోటకుఁబోవుటకుఁ బనియేమి. ఎన్నఁడైనను రాధా

భాయి దేనికైనఁ బొరుగిండ్లకు బంపఁదలఁచినను భీమదాసు గారు నివారించుచుండెడివారు.

ప్రాశ్ని:—నీవు గడచినరాత్రి యింటనే యుంటివా.

దాసి:—ఇంటనె యుంటిని

ప్రాశ్ని:—నీవు భీమదాసును చంపినమాట వాస్తవమా.

దాసి:—(భయముతో) అట్టిపాపము నేను చేయఁగలనా.

రాధ:—అయ్యో! నాభర్త నీవుయె చంపినది (అని యేడ్చును)

ప్రాశ్ని:—(రాధనునివారించి దాసినిజూచి) ఇఁక నెవరుచంపిరి.

దాసి:—నాకుఁ దెలియదు. దైవమున కెఱుక.

ప్రాశ్ని:—ఇంటనున్న నీకే తెలియకున్న నెవరికి దెలియఁగలదు. అనమ యమున నీవింటలేవా.

దాసి:—లేకపోలేదు. నేనుఁబంచపాళిలో నిదురించుచుండ రాధా భాయి యేడ్పు వినఁబడినది. అప్పుడు నేనులికిపడిలేచి యంత భవనమున కటిగి చూడ రాధాభాయియు (యాకూబును జూపి) నీసాహెబుగారును నఱఁకివేయఁబడిన భీమదాసుగారిని చూచుచుండిరి.

ప్రాశ్ని:—అప్పుడు నీవేమిచేసితివి.

దాసి:—కన్నతండ్రికన్న నెక్కువ దయతోఁ బోషించు భీమదాసు గారి దుర్మరణమునకై శోకించితిని.

ప్రాశ్ని:—ఇఁక నీవీబోనునుండి దిగవచ్చును. (అనికూర్చుండును.)

కనక:—(శోధకునిజూచి) విమర్శకాగ్రేసరా! వింటిరిగదా. ఈ సందితురాలి యొక్కయు రాధాభాయియొక్కయు సాక్షియొ క్కయు వాక్యములు. కాన మీశక్తికొలఁది విమర్శించి సత్యము స్థాపింపుఁడు.

శోధన:—(లేచి) మహారాజా! అమాత్యశేఖరా సభ్యులారా! కడచిన రాత్రి జరిగిన నేరమును విమర్శింపఁగా రాధాభాయి యొక్కయు యాకూబుయొక్కయు మాటలు పరస్పరము విరోధములుగ గాని సంబంధము లేక గాని యుండకుండుటచేతను లోకములో దేశద్రిమ్మరులకట్టి యకార్యము చేయుటయందును సందేహముగాని పాపభీతియుఁగాని కలుగకుండుట మనకందఱకుఁ దెలిసిన విషయమగుటచేతను అట్టివారికొకచోస్థావరముగ నుండుటకుఁ గాలునిలువకుండుటచేతను ఈ దాసి దేశమెల్లఁ దిరిగితిరిగి యిక్కడ చేరినదగుటచేతను ఏపనికైన గాని రాధాభాయి యెక్కడకైనఁ బంపదలఁచినచో భీమదాసుగారు నివారించుచుండెడివారని దాసిచెప్పిన వాక్యమందు భీమదాసువలన దాసియొక్క స్వైరగతికి భంగము గలుగునని యర్థము స్ఫురించుటచేతను తన స్వేచ్ఛకు భంగము కలుగకుండుటకై నిందితురాలే యీ నేరము నొనర్చి యుండునని తోఁచుచున్నది.

నిర్భాగ్యురాలగు తన కన్నవస్త్రముల నిశి రక్షించు భీమదాసును జంపి పిదప దాసి యేమిచేయునని ప్రశ్నింతురేని యింతపట్టణమున సామాన్యుఁడగు భీమదాసు వలనగాక వేఱొకవిధమునఁ దనకు బ్రతుకు దెఱవు గలుగదాయెను ధైర్యము దాసికేల లేకుండుననుప్రశ్నయే సమాధానము కాఁగలదు. ఈ నేరమును జరుపుటకుగాని జరిగించుటకుగాని యేవిధమగు సాధనమునకుగాని భీమదాసుయొక్క శత్రువుల సహాయముగాని కోరి పోకున్నచో ధైర్యవంతులైన పురుషులకైన భయంబు కలిగించు పదునొకండు గంటల రాత్రివేళ గస్తీ చేయుచున్న యాకూబునకే దాసి వడివీధిలోఁ గానఁబడుటకుఁ గారణమేమి.

డాక్టరుగారింట నౌషధము గొనివచ్చుచుంటినని చెప్పినదనిగదా యాకూబు జెప్పినది తననన్నుఁడును నిలువెళ్లనీయని భీమదాసట్టిరాత్రి మున విశేషదూరమునందున్న వైద్యునింటి కంపెననుట యెంతసమం జసమో మీరే యూహింపుఁడు.

యాకూబుసాహెబసత్యము బల్కెనందురా. చిరకాలమునుం డియు మన కెల్లఱకు విశ్వాసపాత్రుఁడైన యీతని కేదిక్కులేనిదా నిపై మిథ్యాపవాదము నారోపింప నేమిపుట్టి మునిఁగినది. ఈనేరమెవ్వరు సల్పిరనిన దైవమునకే తెలియుననిగదా దాసి చెప్పినది. తామున్న యింటనంతటి మహాఘోరము జరుగుట తనకెట్లు తెలియదు. భీమదాసు మరణావస్థయందున్నప్పు డరవకుండునా. ఎంత గాఢనిద్రయందున్నను ప్రాణభీతిచే నరచువాని యేడ్పు వినరాకుండునా. నేరము జరిగిన రాత్రి యింటిలో భీమదాసు రాధాభాయియు దాసియు దప్ప నితరు లెవ్వరును లేరని యొప్పుకొనిన విషయమేకదా. ఈ ముగ్గురలో నేర స్థులెవరు. భీమదాసే బలవంతముగ తన శిరచ్ఛేదము గావించుకొ నఁడుగదా. ఇక రాధాభాయిచేసియుండుననిగదా యనవలె. అగ్ని సాక్షిగా వివాహముజేసికొని యనుకూలుఁడై కలసి మెలసి యుండు భర్తనట్టి దుర్మార్గురాలైన చేతులారఁజంపునా. కావున భీమ దాసును దాసియే చంపినదను మాట నిశ్చయము నిర్ధారితము నిస్సంశయము. అనింద్యము. [అని కూర్చుండును.]

కన:—(తనలో) ఆహా యీనిందితురాలను గాంచినప్పటి నుండియు నాకొక విధమైన సత్యముతో గూడిన యనురాగము గలుగుచున్నది. ఈమె నాతల్లిగాదుగదా. అయ్యో నాకంతటిభాగ్యమా ఆసాధ్వీమణి యెప్పుడే సాగరమునబడి చచ్చి యుండును. [దాసిని జూచి] ఏమమ్మా యీ నేరము నీవలననే జరిగినట్లు

నిశ్చయించి శిక్ష విధింపఁబోవుచున్నారము. నీకేమైన సాక్షు
లుగలరా !

దాసి:—ఇట్టి పాపాత్మురాలికి సాక్ష్యముగూడ గలుగునా.

కనక:—అటులనచో నీనేరమే నీవు చేసినట్లు లొప్పుకొనుమా.

దాసి:—(ఊరకుండును విచారమున నధోముఖయగును.)

కనక: (తాను జేసిన సిద్ధాంతమును మంత్రి కొసఁగును.)

మం:—(లేఖను గొని) మహాజనులారా! శ్రద్ధాళురై వినుఁడు. ఈనేర
మును గాథాభాయియు యాకూబును చెప్పిన మాటలను
శోధకులు చక్కఁగా విమర్శించి నిశ్చయించుట చేతను
నిందితురాలు తన దోషనివారణమునకై యేవిధమైన సాక్ష్య
మునుగాని కారణమునుగాని చూపకుండుట చేతను దాసియే
చేసియుండునని తోఁచుచున్నది. కావునఁ దన కష్టసుఖములఁ
బాల్గొనుచు దనను రక్షించు భీమశాసన కుపకారము చేయుట
మాని శిరఃఖండనము గావించిన యీదుష్టురాలికి శాస్త్రసమ్మ
తముగ వధ్యస్థానమున శిరఃఖండనము గావించునట్లు మహా
రాజుగారు తీర్మానించిరి (అని చదివి) సేవకా! ఈదాసిని
తలవరులకడకుఁ గొనిపోయి మహారాజుగారి శాసనము నెఱఁ
గింపుము.

సేవకు:—(చిత్తము అని దాసితో నిష్క్రమించును.)

పేరుసెట్టి:—(రొప్పుచు పరుగునవచ్చి) మహారాజా నమస్కారము.

కనక:—పేరుసెట్టీ! ఏల నివిట్లు బరుగెత్తి వచ్చితివి కారణమేమి.

పేరుసెట్టి:—దా-సి-కా-దు.

కనక:—ఎందులకింత యాయాస మొందెదవు.

పేరు:— అయ్యా ! ఇదిగో (అని యొక రక్తముచేత నగము దడిసిన చేతిగుడ్డ నిచ్చును )

కనక:—(మంత్రికిచ్చి) అమాత్యా ! దీనిని విమర్శింపుము.

మతి:— (దానిని బరిశీలించి) సెట్టీ దీని నేమిచేయుమనెదవు.

పేరు:- అయ్యా ఇది రామసింగుగారిది.

మతి:—రామసింగెవరు. ఇది నీకెట్లువచ్చినది.

పేరు:—భీమదాసుగారి దొడ్డివాకిట దొరికినది. రామసింగనఁగా గ్రామపాలకుఁడు.

మతి:—ఇదేమీ ఆశ్చర్యముగానున్నదే. పేరుసెట్టీ దీని నవిస్తరము జెప్పుము.

పేరు:—నేఁడుదయమున నేను వెలుపలకుఁ బోవుచుండనిది భీమదాసుగారి దొడ్డివాకిట దొరకినది. దీనిని పరిశీలింపఁగా రామసింగు అని యుంటచేతను మఱియును నగము నెత్తుటిలోఁ దడసి యుంటచేతను నిడపన రాత్రి నేను పొరుగూరునుండి వచ్చుచు భీమదాసుగారి దొడ్డివాకిలి సమీపమున రామసింగుం జూచి యెందులకీ రాత్రియందుంటివని యడుగ నతఁడు భయముతోఁగూడిన కోపముతో నావిషయము నీకేల నేనీనాఁడిక్కడ నానవచ్చితినని యెవరితోడనైనఁ జెప్పితివో నీశిర మీ ఖడ్గమునఁ ద్రెంచెదనని తన చేతనున్న భయంకరమగు కరవాలము జూపి నన్ను బెదరించుటచేతను తమ స్వేచ్ఛకు విఘ్నకారయగు భీమదాసుగారిని బాధరామసింగుచే జంపించియుండ నోవునసియు తమ వతియగు దాసినినిందించుట దోషమనియు నేలినవారితో మనవిచేయుటకొఱకు వచ్చుచుండఁ జూచి రామ

సింగు నన్ను విచారణ సమయమున నిక్కడకు రాకుండునట్లు జేయ నెంచి యేదో పనిగల్గినట్లు నిల్పి కదలనీయం డయ్యె. కొంతవఱకు పొరుగూరున కేగవలయునని నమ్మించి యీ సాధ్వి కేయపకారము జరుగునోయను భయమునం బరుగెత్తి వచ్చితిని. అయ్యా రక్షింపుడు పాపమా దాసి నిందితురాలుగాదు.

మతి:—అవును కావచ్చును. ఈగుడ్డమీఁద నొకవైపున రామసింగు అని వ్రాయఁబడియున్నది. (అని యందఱి యుత్తరముం జూపును. అందఱు నాశ్చర్య మొందుదురు)

కన:—(కోపముతో) ఛీ దుర్మార్గురాలా! రాధా! మమ్మెంత మోసము జేసితివి. నీమూలమున దిక్కులేని దాసికి శిరఃఖండనము విధించితిమి (సేవకుని జూచి) ఓరీ నీవు తలవరులకడకీ రాధను గొనిపోయి దాసికి విధించినశిక్ష యీ రాక్షసికి మార్చఁబడినదని నాయాజ్ఞ నెఱిగింపుము ఆలస్యము చేయకుము. (సేవకుఁడు నిష్క్రమించును)

కన:—మంత్రిపుంగవా చూచితివా లోకమునం దెంతటి సాహసురాండ్రుందురో.

మతి:—అవును నిజమే.

కనక:—(స్వగతము) అహా! ఆమెయందు క్షత్రియాంగన లక్షణములు గానవచ్చుటయే గాక గౌరవ సహితమగు నొకవిధమైన యనురాగముగూడ గలుగుచున్నది. కావున నామె వృత్తాంతమంతయు దెలిసికొనవలయును (ప్రకాశముగా) మంత్రీ నేటికీ సభ చాలింతము.

మతి:—చిత్తము. (అందఱు నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.

శ్రీ

మీనాక్ష్యైనమః.

# విషాదకనకతారీయము.

## పంచమాంకము.

**కంచుకి:**—(ప్రవేశించి) నేనుపుట్టి చాలకాలమైనను స్త్రీలయందింతటి సాహసవతులనుగాంచి యెఱుఁగను నిరంతరము రామసింగు మైత్రియే నిత్యమని దైవోపహతయగు చారుమతీదేవిపై నిందగల్పించిన యాదుష్టురాలగు రాధయిప్పుడేమి మాటక్కొనినది. విటుని వలన మగని జంపించి నందులకు ధర్మదేవత తుదకు తనపాలి మృత్యువయ్యెను గదా. అపురుకాని విధ్యుక్తముగా వివాహమాడిన భర్తను జంప దోషమనియైన నెంచకుండెను గదా ఇదియు నొక మహాకార్యోద్ధరణము. ఏమందువా. ఈరాధమూలముననే గదా ప్రచ్ఛన్నవేషంబునఁ దన పాతివ్రత్యంబు గాపాడుకొనుచున్న చారుమతీదేవి దాసీత్వంబు విడిచి కుమారుని గాంచఁగలిగినది. భీమదాసుగారే జీవించియుండిన తన యింట మహారాజుగారి తల్లి దాసిగా నుండి నందుల కెంత నొచ్చుకొనునో, తనతల్లిని రక్షించినందులకు రాజుగారివలన నెంత పొగడ్తఁబొందునో గదా. ఆపాడు రాధ ధనముకొఱకై యిట్టి ఘోరకృత్యముఁ జేయఁగలిగినది. అహో! ధనమెంత సామర్థ్యము గలది! దారిద్ర్యము కూడ నిట్టిదియె.

మ. కులధర్మంబులఁ బాడుచేయు నరకక్షోణిఁ బ్రవర్తించు మి
త్రులలోనఁ బరిభావమొందును దురుద్యోగంబు గాంతించు న
వ్వలనన్ శంఖమొంచెంచు నీవలన విద్వద్గోష్ఠులన్ వీడినిం
[illegible]లై చెడిపోవుగాదె నరుఁడో దారిద్ర్యమా క్రూరమా!

మఱియును:—ఇందువలననే గదా నేను—

ఉ. ఏలికకాగ్రహంబు జయించునో యేమొ యటంచు భీతినే
వేళను దన్నియుక్తము వేగమసల్పుచు నింటికేని వా
హ్యాళిజరింప నాసపడియుండఁ బరాజ్ఞకుఁ జేతులొగ్గి యీ
లీలఁజరింపఁగా వలసె లెంక తనంబునఁ బాడుపొట్టకై.

నేఁటివఱకు వీరసేన మహారాజుగారి సమీపమున నుండుట
చేతన చాల డబ్బు సంపాదించి నాటివారిలో బ్రశంస నీయుఁడుగ నుం
టిని గాని దైవయోగమునఁ జేసి కల్గిన దుష్టబుద్ధి పరిపాలనంబున దరి
ద్రుఁడనైతిని. అందులకే గదా జన్మస్థానమువీడి [illegible]నగర[illegible]న గనక
శేఖర మహారాజుగారి కొలువు గొలువవలసి వచ్చినది. ఔరా దుర్మా
ర్గుల మైత్రియందఱకు ననర్థకరమే

తే. గుణమెఱుంగక స్నేహంబు గూర్చెనేని
వాని కిడుమలు వాటిల్లు బహుళముగను
తెలుపమునదివ్యో గదయని పేర్మితోడ
ముద్దుబెట్టిన నాసాలు బూదిగావె

నేను కష్టపడి వార్ధకమున నక్కఱకు వచ్చునుగదా యని
యార్జించిన ధనమెల్ల దుష్టబుద్ధి పరిపాలనంబున గోలుపోతిని సం
పదలు నిత్యములా!

ఆ. నిరత మొక్కచోట నిలచియుండుననరగా
సాధ్వివోలె గేస్తు సంతసింప

రసనిర్యోక్తమైన రత్నాకరునిజేరి
పాఱునదులఁబోలె పరచుఁగాని.

భీష్ముఁడు:—(ప్రవేశించి) ఎవరక్కడ.

కంచుకి:—ఎవరైన నీకేమి.

భీష్ము:—ఏమి నీ గర్వపు మాటలు నేనెవరో తెలియునా.

కంచుకి:—నీ వెవఁడవైన నాకేమి.

భీష్ము:—ఎవఁడీగర్విష్ఠి వీనిస్వరముజూడ నిదివఱకెన్నడో విన్నట్లున్నది. మనకంచుకిగాఁబోలును కదా. అవునతఁడే (సమీపించి) (ప్రకాశము) తాతా నీవా! ఇతరు లెవరోగదాయని తలఁచి మాట మిగిలితిని కోపింపకుము. ఎక్కడకో ప్రయాణము చేయుచుంటివి.

కంచుకి:—ఓహోహో భీష్ముఁడా నాయనా ఎక్కడినుండి వచ్చుచుంటివి. ఈ గోదావరి మొగము జూచితినోగాని యొక తెల్లని రూక యైనఁ రాలేదు.

భీష్ము:—చ. ధనము ధనంబటంచుఁ బరితాపముఁబొందఁగనేల ధాత్రిలో
జననము నొందునెల్లరును శాశ్వతులే క్షణభంగురంబులౌ
తనువులనమ్మి నీచమగుదాస్యము జేయుట కీర్తియే నృపా
లుని వచనంబులే ధనము లోకమటందును నమ్ము రాదొకో.

కంచుకి:—నీమాటలు బాగుగనే యున్నవి. ఎవఁడో విరాగిబోలె చెప్పుచున్నావు. ధనమునకు లొంగనివారెవరు.

భీష్ము:—తే. ఎవఁడు స్వచ్ఛంద వృత్తిచే నిలఁజరించు
నతని జన్మంబె సార్థక మగునుగాని
యాలుబిడ్డల కొఱకు హేయంబులైన
కార్యములొనర్చువాఁడొక ఘనుఁడె చెపుము

తే. ధనపిశాచంబు పట్టి నిన్ననయ మిట్లు
బాధపెట్టెడు నేమని పలుకనేర్తు
బ్రతికియుండిన కన్నాళ్ళు ప్రాణులైన
వారలకు స్వేచ్ఛయొకటి గావలయుఁగాదె.

కంచుకి:— (స్వగతము) ఓహో యీ యువకుఁడు కలహములోనికి దింపఁజూచుచున్నాఁడు. ఈ ప్రసంగము మఱపించెదగాక (ప్రకాశముగా) అబ్బాయీ యీమాటలెప్పుడునున్నవియే కాని విశేషములేమిలేవో యెఱుఁగుదువా?

భీష్మ:— విశేషములేమున్నవి. భీమదాసుగారింట నున్నదాసి మహారాజుగారి తల్లియగుట తెలిసినవిషయమేకదా, తమకుఁ జాల కష్టదశగల్పించినందులకుఁ గోపించి కనకశేఖరమహారాజుగారు దుష్టబుద్ధితో యుద్ధముచేయుచున్నారని మనవీధిలో కింవదంతి గలిగినది

కంచు:— అదియా భటులకల్లోలము మనము వెళ్లనవసరములేదుగదా.

భీష్మ:— అంతఃపురపాలకులకు యుద్ధములోఁబనియేమి!

(తెఱలో) ఓరీ! కులనాశకా, దుర్మదాంధా, చతుర్దశభువన ప్రథిత రాజవంశపాదోధిహాలాహలమా

శా. అధీమంతుఁ బ్రతాపుఁ దస్మద్గురుఁడై ♦ యంతంబుగావించి భూ
నాథున్ నిద్దురలోపలన్ గడపి కాం ♦ తన్ వేచరన్ బట్టి చీ
చీ ధైర్యంబుగలాఁడువోలె జయల ♦ క్ష్మీసంగమోద్యోగివై
క్రోధావేశుఁడవైన నాయెదుర నీ ♦ కున్ నిల్వఁగా శక్యమే.

కంచు:— (ఆలకించి) ఏమిదీ! సకల భూమీశ్వర మకుటమాణిక్య విరాజితపాదకమలుండగు వీరసేన మహారాజుగారి కుమారుఁడు

ఉ. పోరులవీరలఁ దలచి ♦ వాగదవేమిటి కాదుదానియు
ట్లారసిమత్ప్రయుక్తనిశి ♦ తాస్త్రపరంపరకోర్చినిల్వ నీ
శూరతఁజూపుకొమ్మువుడ ♦ చూచెదఁగాక భవత్పరాక్రమా
రార రణాంగణంబున జ ♦ కారిని నన్గలువంగ నేర్తువే.

కన:—ఓరీ దుర్వినీతా! అధర్మమార్గగామీ!

చ. అనుజుఁడవంచుఁ జేర్చి మెయి ♦ నాడినయాటలనెల్లఁ జూచి చూ
డనియటులున్న శాంతమతి ♦ నగ్రజుఁ జంపుటా పౌర కాంతలఁ
గనుగొని బల్మి బావమున ♦ కఱ చెరబట్టుటా కాదుకాదు మ
ద్ఘనభుజశౌర్యవహ్నియది ♦ కాల్చుభవద్భుజకాష్టసంతతిన్.

దుష్ట:—ఓరీ ఆత్మశ్లాఘాపరాయణా డింభకా! నిన్ను నీవు చెప్పుకొని యేలపొంగెదవు. హనుమంతుని మ్రోలగుప్పిఁగంతులన్నట్లు నాయొద్దనా నీశౌర్యమును బొగడుకొనియెదవు.

ఉ. బాలుఁడవీవు చూడఁ బదివర్షములైనను లేనివాఁడ వీ
యాలమునందు నన్నెదురు నంతటివాఁడవె నేఁడు మద్భుజా
భీలకరప్రహారముల పీఁగకనిల్వుము రిత్తపల్కు లిం
కేలవృథా భవజ్జనకుఁ డేగినచోటికి నిన్ను బంపెదన్.

కనక:—ఓయీ వ్యర్థముగఁ గాలయాపన మేలచేయఁ దలఁచెదవు. జయాపజయములు పాక్షికములు గదా. కావున నీకో నాకో జయము గలుగవలయును రమ్ము. ఇది కాచుకొనుము. (అని కత్తి విసరును.)

దుష్ట:—(తప్పించుకొని) ఓరీ పౌరుషశూన్యా! నీప్రతాపమింతటితోఁ దీరెనా. మరేమైనఁ గలదా. విశాలోరస్కుండనగు నాకుఁ దాకి నీచేతఁబట్టిన కత్తి యెట్లు ముక్కలైపోయినదో చూడుము (అని కత్తినెత్తి చూపును.)

కనక:—ఓరీ వ్యర్థప్రలాపీ! ఏమనిరా! ప్రేలెదవు. అలక్ష్యంబుగఁ బ్రయోగించిన నాశరవాలమును దప్పించుకొంటినని నీకునంతో షమేల.

ఆ. రుద్రుఁడొండె వీరభద్రుఁడొండె మదీయ
సితశరాళికోర్వ జతురుఁడగుఁడు
కాచుకొనుము నీకుఁ గాలంబుచేరువ
యయ్యె నేఁడెయిట దురాత్మనీవు

(అని వేఁటొకశక్తిని విసరఁబోవును.)

దుష్ట:—(తనలో) ఇతఁడు బాలుఁడయ్యుఁ బ్రయోగోప సంహారము లందుఁ బెద్దయై వర్తించుచున్నాఁడు. ఇప్పటికి నాకే యప జయము గలుగుచున్నది. ఇప్పుడితఁడు బ్రయోగింపఁ బూను కొనిన దజేయంబగు నస్త్రము దానికి నేనుకూడ నాహుతి గాక తప్పదు. కావున నామాయోపాయంబున వీని యస్త్ర ముపసంహరింపఁ జేసితి నాతరువాత తిప్పలాలోచించుకొనవ చ్చును. (ప్రకాశముగా) ఓరీ! అనాత్మజ్ఞా! నీవు బాలుఁ డవు. శత్రుప్రయుక్తములగు నస్త్రములు నుపసంహరించు టయు గురిదప్పక వైరిపైఁ బ్రయోగించుటయు నించుకేనిఁ దెలియని వాఁడవు. అట్టినీతోడ నస్త్రయుద్ధముజేయుట సమం జసముగాదు. శూరులు నిందింతురు. నీకేమైన ముష్టియుద్ధం బునఁ బరిచయమున్న నన్నుఁ దూర్కొనుము. చిరకాలము నకు యుద్ధము గలిగెఁగదాయని యుప్పొంగుచున్న నాభుజ ముల కండూయనము బోవునట్లు నిన్ను వధించెదను.

కనక:—ఏమీ. అస్త్రప్రయోగము నీవెఱింగినంత నేనెఱుఁగనని తల చితివా. వ్యర్థముగ వాగక పౌరుషము గలదేని నన్ను

మోహారింపు లేదేని గాలికి బుద్ధిచెప్పి యెంగైదన బ్రతుకుము. ఇదేమైన యుద్ధమనుకొంటివా. నిద్రితులఁ జంపు టనుకొంటివా. (అని కత్తిద్రిప్పుకొనుచు బైకురుకును.)

దుష్ట:—అగుమాగుము. (అని చేయిచడ్డి) నీవలెనేను మాత్రము కత్తి త్రిప్పలేననుకొంటివా. అర్భకుఁడవు గదాయని యుపేక్షాభావముతోనుంటిని గాని లేకున్న నీపాటికి నీ యయ్యకడకుఁ బంపియేయుందును. ఇప్పటికి మాత్రము మించినదేమి. కాని నేనొకమాట జెప్పెదను వినెదవా చెడెదవా.

కనక:—ఏమని చెప్పెదవు. (అని దరహాసము సల్పును.)

దుష్ట:—మన యిరువురకతన నిప్పటికెంతయో సైన్యము రూపుమాసినది. మఱియు మిగిలిన సైన్యముగూడ నశించినది యొవరికిని జయము కలుగదుగదా.

కనక:—అవును నిజమే. అయిన నన్నేమందువు.

దుష్ట:—అందు వలన సంధి జేసికొందము. ఇది సర్వశ్రేయము. అనింద్యము. సకల సమ్మతము.

కనక:—ఇదియా నీవు చెప్పుమాట.

మ అనిలోనిల్వగ నేర్పుజాలమి ననూర్వ్యంపశ్యతాకాంతల
ట్లనివార్యంబగు మచ్ఛరప్రకరమార్తాండోద్ధతిన్ భీతిచే
తనువేళాశ్వతమంచులోఁ దలఁచి తాత్రంబింతయున్ లేక సం
ధినొనర్పఁగ మకించినాఁడవె యునీ ధీరోత్తముల్ మెత్తురే.

గీ. పౌరుషము శౌర్యమును నరపాలకులకు
ముఖ్యములువాని విడిచి యెప్పుడును రాజ
మాత్రునకుఁ జరింపగరాదు మహీనతండు
పశువువోలె గణింపగఁ బడును గాదె.

కావున మన కిరణమధ్యమున సంధిచేయుట తగదు. ఏది యె
ట్లైనను రణముజేసి జయమోయపజయమో గాంచవలసినదే.

గీ. జయముగాంచుదువేని రాజ్యమునకెల్ల
స్వామి వగుదువు లేకనజయమెగన్న
స్వర్గకాంతలతో గూడి సౌఖ్యములను
జెందుదువు సంధిపైయాన నొందనేల.

దుష్ట:—ఓరీ దుర్వినీతా ! నీమేలుగోరి చెప్పినందులకా నన్ను దూల
నాడుచున్నావు, అట్లైన నాలసింపక రమ్ము. స్వర్గకాంతల
కడ కనిపి సుఖంబుఁ గూర్చెద.

కన:—దురాత్మా ! రమ్ము. నీముష్టి యుద్ధమందలి చాతుర్య మెతేఁ
గెద. (అనిచేయిబట్టుకొని యీడ్చుకొని పోవును.)

(అంతట భీష్ముఁడును చారుమతియుఁ బ్రవేశింతురు.)

చారు:—అయ్యో చిరకాలమునకుఁ గనుబడిన నాపుత్రునిఁ దనివి దీరఁ
జూచుకొనకుండ నీపాడు యుద్ధ మొకటి సంభవించెనే నూయి
యగు దుష్టునివలన నేమి యపకారము గల్గునో కదా.

భీష్ము:—అమ్మా ! యుద్ధభూమిని సమీపించితిమి. ఇంచుక సహిం
పుము. (తెరలో.)

శా. ఓరీ ! నిల్వుము పారిపోవకు రణోద్యోగంబు జాలించి యే
వారల్ నన్నెదిరించి నిన్నిటను బ్రోవన్ నేర్పరుల్ లేరు వి
స్తారంబై నుతిఁ గాంచినట్టి నృపవంశం బందు జన్మించి నీ
వీరీతిన్ వెనుకంజవేయఁ దగునే హేయంబుగాదే ధరన్.

భీష్ము:—అమ్మా ! నీవిందుండుము, అవ్వో కనకశేఖర దుష్టయుద్ధ

లకు ఘోరమగు యుద్ధంబు జరుగుచున్నది. ఆరాతి సంహార
మునకై చిరంజీవికి సాయమగుదును. (అనిపోవును.)

చారు:—

మ. ప్రతిపక్ష ప్రకరం బజేయుఁడగు నేరాజన్యమాధర్మ్య స
ప్రతిమానంబగు శౌర్యమస్ఫురణ కెప్పాటం దలల్వంచి సం
తతముం ద్రొక్కుచు నుందురా ధరణినేలం గూడిసౌఖ్యోన్నతిం
పతినై యుండుదునేని నానుతున కాశిత్రుండు వధ్యుండగున్

భీష్మ:—ఉ. నీ యభివృద్ధినే యరయునీతి విదుండగు భ్రాతఁజంపియా
హా యని దీనయై వెతల నందెడి సాధ్విని బల్మిఁ బట్టియున్
హేయము నాక యొప్పుడొనరించిన పాపఫలంబునీకుఁ దో
డై యరుదెంచుచున్నయది యాజిని బోరినఁగాని తప్పునే

(అని దుష్టబుద్ధి కురులఁబట్టి యీడ్చుకొనివచ్చును.)

కనక:—(వెంటఁ బరుగెత్తివచ్చి)

చ. అని ననుమోహరించి విజయంబును జెందఁగలేక నీచుఁడై
చనియెడి దుష్టదాంధుని జెనర బరిమార్చెద సజ్జనాళికిన్
ఘనమగు సౌఖ్యసంతతిని గల్గఁగఁ జేసెద నిష్కళంకమై
తనరెడి కీర్తిఁగాంచెద బుధ ప్రకరంబు నుతించుచుండఁగన్

(అని దుష్టబుద్ధి శిరము దెగవేయును.)

(తెరలో) ఓహో మహారాజా! మీతండ్రిగారు వ్యాఘ్ర
కాంతా శ్లేషము గావించినది మొదలు కష్టసముద్రమున మునిఁగిన
మమ్ము రక్షింపుము.

చారుమతి:—అదిఏమి. ఎవరో దీనులమొఱ్ఱవోలె వినవచ్చుచున్నది.

భీష్ము:—ధనగుప్తాదివైశ్యాగ్రేసరులు పరంపరాగతమైన యీసింహాసన మలంకరించి మరల న్యాయబీజంబు నాటుఁడని వేడుచున్నవారు.

కన:—అటులైనచోఁ బోవుదమురండు.

(అందఱునిష్క్రమింతురు.)

(పట్టాభిషేక మందిరము కనకశేఖరుఁడు భీష్ముఁడు కంచుకి పౌరులు ప్రవేశింతురు.)

భీష్ము:—వీరసేన మహారాజుగారు పరలోకమున కఱిగిననాటనుండియు ననాథయై చింతా సాగర నిమగ్నయగు నీరాజ్యలక్ష్మి నుద్ధరించుటకై యిదె నవరత్న ఖచితమగు సింహాసన మలంకరింపుఁడు. (అని కనకశేఖరునకు సింహాసనముఁ జూపును)

కన:—(కన్నీరు విడచుచు) అకటా ఇట్టి మహోత్సవ సమయంబున మాతండ్రియుఁ గోమలాంగియగు నాసోదరియు నుండిన నెంత సంతసింతురో గదా. పూజ్యులగు వారి గ్రామాలసింహాసన మెక్కు భాగ్యము లేకపోయెగా.

భీష్ము:—మహారాజా! ఇట్టి మంగళప్రదమగు సమయమునఁ జింతింపఁదగునా! విధికృతమునకు వేఱు జరుగఁగలదా విచారమొందకుఁడు.

కన:—(విచారము నభినయించుచు) అయ్యో అకాలమరణము నొందిన మాతండ్రిగారి సింహాసన మధిష్ఠించుటకు నామనసొప్పుట లేదు.

భటుఁడు:—(ప్రవేశించి) మహారాజా! ధీవరమంత్రిగారును తారాదేవియు వచ్చుచున్నవారు.

కన:—(ఆశ్చర్యముతో) ఏమీ! మా యక్కగారగు తారయూ ధీవరమంత్రియూ? నిజమా వచ్చుచున్నవారా! బాగు బాగు నాయదృష్టమేమని పలుకవలయును.

(తరువాత తారావళియుధీవరమంత్రియుం బ్రవేశింతురు.)

కన:—[తారావళిని కౌఁగిలించుకొని]

చ. అలసి పిపాస మూర్ఛపడి నట్టిననున్ విడనాడి నీరద
వ్యూలఁగొనివత్తునం చటులఁబోయి యదృష్ట వశంబునన్ ధరా
తలమునకెల్ల రాజనయి తత్పరిపాలనలోనఁ జిక్కినిన్
దలపకయుంటి నన్నిఁకు డుదారమతిన్ గరుణింపు సోదరీ

అయ్యో నీవా కారడవిలో నాకొఱకై యెంతవంత గుందితి వోగదా అప్పటి కష్టంబులఁ దలఁచికొనిన నాగుండెలవియుచున్నవి.

తార:—తమ్ముఁడా! నాపూర్వసంచితముంతు నీవేమి చేయఁగలవు.

ధీవర:—కుమారా! ఇట్టి సమయంబున నొకటి కష్టములఁ దలఁచి విచారపడుంచుట భావ్యముగాదు. మహూర్తము సమీపించుచున్నది. సింహాసన మలంకరింపుము.

కన—అయ్యో నేనే జీవితముని నాకై యెంతయో దపంబు జేసిన జనకుఁ డధర్మమరణమందఁ దచ్ఛింహాసన మెట్లెక్కఁ గలను. శ్రీరాముని పాదుకల భరతుఁ డభిషేకించినటుల నేనును వీరసేనపాదుల వారి పాదుకల నిందభిషేకించి రాజ్యంబుఁ గావించెద వేఱుగఁ దలఁపకుఁడు.

(తెఱలో) కుమారా! కనకశేఖరా! వలదు వలదు నీ తండ్రిగారు మరణింపలేదు. దుష్టబుద్ధివలనఁ బాతాళ గృహమున బంధింపఁబడి యున్నవారు.

## విషాద కనకశారీయము.

కన:—(ఆశ్చర్య సంతోషములతో) ఎవరీ శుభవాక్యముల విని పించువారు.

ధీవర:—కుమారా! భగవతియగు నశరీరవాణినోట వెలువడినవిగాఁ దలంచెద సత్యమేయగును.

భీష్ము:—భగవతి వాక్యము లసత్యము లెట్లగును.

కన:—(వేగిరపాటుతో) మాతండ్రిగారు సజీవులగుట నిజమేకద. పాతాళ భవనమున బంధింపఁబడిరా? (కంచుకిని జూచి) ఓయీ యీవృత్తాంతము మాతల్లిగారి కెఱిఁగించి మాజనకుని వేగమకొనిరమ్ము (చిత్తముఅని నిష్క్రమించి) (వీరసేనమహా రాజుతో మరలఁ బ్రవేశించి) దేవ యిటుయిటు

వీర:—(కనకసేనుని గౌగిలించుకొని)

తే. చిన్నతనముననే దుష్ట చిత్తువలనఁ
గెంద రానట్టి యిక్కట్లు గెందియుకట
దైవయోగంబునన్ నిరంతర సుఖాంబు
లందఁగా నేర్చితివి గదతయ్యనుతుఁడ

(అని దుఃఖించును.)

ధీవర:—మహారాజా! శాంతింపుము (కనక శేఖరుని గాంచి) ఆయు ష్మంతుఁడా! నీవాంఛితము దీరినదిగదా ఇఁక నాలసింపక పితృదత్తమగు శుభాసన మలంకరింపుము.

వీర:—(సంతోషముతో కనకశేఖరుని యాసనమున గూర్చుండ బెట్టును.)

ధీవర:—కుమారా ఈశ్వరానుగ్రహమున నెల్లకష్టంబులు గడచి పితరులతోడను భగినితోడను గలిసి సుఖులుగాఁ బట్టాభిషిక

మహోత్సవముగూడ ననుభవించితివి. మఱియు నీయభీష్ట
మేమి ?

కన:—ఆర్యా! తమ యనుగ్రహమునఁ గలిగిన యీ సంతోష
కార్యమునకన్న వేఱుగ నాకుఁ గావలసిన దేమున్నది. అయిన
నిట్లగుఁగాక.

భరతవాక్యము.

ఉ. పౌరుషవంతులై యవని పాలురు ధర్మము సాధకంబుగా
ధారుణినేలఁగావుత బుధవ్రికరంబు విధిజ్ఞతన్ గులా
చారము వీడకుండుతఁ బ్రశాంతిని జెందుత నీతిబాధలున్
శ్రీరుచిరాంగుఁడీ కనకశేఖరుఁ డున్నతకీర్తిఁ గాంచుతన్

(అందఱు తథాస్తు అని నిష్క్రమింతురు.)

గద్యము.

సీ. ఏమహామహుఁడు శ్రీవేమనారాధ్య
వంశాంభోధిపూర్ణ శశాంకుఁడయ్యె
నేతల్లి సావిత్రి కనమై బుధుల్ మెచ్చ
మహిని బాతివ్రత్య మహిమఁ గాంచె
నట్టినందయకు గౌరమకు ద్వితీయపు
త్రుండఁ గౌండిన్య గోత్రుండ దక్షి
ణామూర్తికిని శివానందంబునకు
సోదరుండఁ గూర్మి యగ్రజుండ నుబ్బ

గీ. నార్యునకుఁ బౌత్రుఁడను మదీయమగునట్టి
కనకతారీయమును రూపకంబునందు
నరయుఁగా సకలము బంచమాంకమయ్యె
నతముఁ రక్షించు దీనిని జంద్రమౌళి.

---

# భక్త కబీర్.

గ్రంథకర్త కోడాలి సత్యనారాయణరావుగారు.

భక్తికి మించినవస్తువు యీ లోకమునందేదియు లేదుగదా! భక్తులయొక్క చరిత్రములుగాని, చర్యలుగాని, విని ఆనందించని మనుజు డుండునా? మనుజుడననేల. కఠినమైన శిలలు కరుగును. ఎండిన మోడులు చిగిరించును ఇంతియుగాక సకలరక్షకుడగు పరమేశ్వరుడే "గోవువెంట దిరుగు కోడెభంగి" అను బమ్మెరపోతనామాత్యుని వాక్యము ప్రకారము సంచరించును. భక్తిరస ప్రధానములగు చరిత్రములు ఎన్నివిధములుగా ఎవరురచించినను చదివి సంతోషింపని మానవు డెవడుండును. ఈ ముద్దులొలుకు నూతననాటకరాజమున వేదాంత రహస్యములు విపులముగా దెలుపబడినవి. శ్రీరామభక్తుడగు, కబీరునియొక్కయు, శ్రీకృష్ణ భక్తుడగు గోపీదాసుయొక్కయు, వాదప్రతివాదములు అమందానంద జనకంబై తనరారు. తత్సందర్భమున వినాయకుడు, కుమారస్వామి, సరస్వతి, పార్వతి, ఈశ్వరుడు మొదలగు దేవతానీకము ప్రత్యక్షమగుటయు, కృష్ణుడే గొప్పవాడని చెప్పుటయు, శ్రీరామ భక్తుడగు కబీరుదాసు వారి మాటలను నిరాకరించుటయు, రామకృష్ణులు ప్రత్యక్షమగుటయు మొదలగు సంశయము తొలగియు, హృదయరంజకమ్మై యుండు సందర్భానుసారముగ, భక్తిరసమొలికించు పాటలు, సంవాదము, శ్రీరామకర్ణామృతం, శ్రీకృష్ణకర్ణామృతం, భజగోవింద శ్లో. లు చక్కని కీర్తనలు గల్గి ప్రదర్శనయోగ్యముగా నుండును అనేక నటసమాజముల వారి నాటక ప్రకటనమునవిని, పదే పదే వ్రాయుచుండుటచేత శీఘ్రముగా వెలవరించుటకు కారణమైనది గ్రంథకర్త గారిక్కృతిని ఆంధ్రపత్రికాధిపతులగు శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికి సమర్పించుటచే గ్రంథప్రశస్తి వేరుగ మేము వ్రాయనక్కరలేదు. ఆలసించిన ప్రతులు దొరకనేరవు. నేడే కార్డు వ్రాయుడు. వెల రు 1-0-0 మాత్రమే

వలయువారు:— కే. కే. పట్నాయక్ & బ్రదర్సు,

బుక్కు సెల్లర్సు & పబ్లిషర్సు-ఏలూరు, కృష్ణాజిల్లా.

# పాదుకా పట్టాభిషేకము

(గ్రంథకర్త:—కొడాలి సత్యనారాయణరావుగారు.)

సకల లోకాభిరాముఁడగు శ్రీరామచంద్రుని యొక్క చరిత్ర యెన్నివిధముల వ్రాసినను, ఎందఱు వ్రాసినను కర్ణానంద సముద్రమున నోలలాడించక యుండునా! ఇందలి శ్రీ సీతారామచంద్రుల నిజ నమేతముగా వనవాటికంపబడ కారకురాలైన మందరయొక్క పాత్ర బహు చక్కఁగా పోషింపఁబడి యెంతయు యుక్తియుక్తముగా నుండును. తండ్రియగు దశరథుని పరితాపము, అనుజుఁడగు భరతుని వ్యాకులము, రఘురామునియొక్క ధైర్యమును దిలకింప, భాతృ, పితృ, భక్తియు, సీతామహాదేవి యెన్నియిక్కట్టులనైన నోర్చి పతివెంట వనవాసము చేయుటవలన లోకములకు ప్రకాశింపజేయు పాతివ్రత్యమహిమయు, లక్ష్మణుని యొక్క సహోదర వాత్సల్యమును యెంతయు మనోహరములై యున్నవి. జగమెఱింగిన బ్రాహ్మణునకు జందెమేల యనినట్లు అందరకు తెలిసిన విషయమే. అధికముగా వ్రాయఁబనిలేదు.

నేఁడే కొఱకు వ్రాయుఁడు. వెల రు 1-0-0 మాత్రమే

# తులసీదాస్.

(గ్రంథకర్త కొడాలి సత్యనారాయణరావుగారు.)

భక్తిరస ప్రధానమగు సీనూతన నాటకమును మీరిదివరకు చూచియుండలేదు.

వెల రు 1-0-0 మాత్రమే.

వలయువారు:—

**కే. కే. పట్నాయక్ & బ్రదర్సు**

బుక్కు సెల్లర్సు, ఏలూరు, కృష్ణాజిల్లా.

# మావద్ద వెలకుదొరుకు పుస్తకములు:

| | |
|---|---|
| సంపూర్ణభారతం పి॥వా॥న॥ | 1-8-0 |
| సంపూర్ణరామాయణం గూ॥ కో॥ | 1-4-0 |
| సంపూర్ణోత్తరరామాయణం | 1-4-0 |
| సత్యహరిశ్చంద్ర చి॥ ల॥ | 1-4-0 |
| ద్రౌపదీ వస్త్రాపహరణం | 1-0-0 |
| పారిజాతీయం | 1-0-0 |
| బుద్ధిమతీవిలాపం | 1-0-0 |
| సతీతులసి | 1 4-0 |
| సువర్ణపాత్ర | 1-0-0 |
| చిత్రనళీయం [బళ్లారివి] | 1-6-0 |
| విషాదసారంగధర డిటో | 1-6-0 |
| సావిత్రిచిత్రాశ్వము డిటో | 1-2-0 |
| ప్రహ్లాద డిటో | 1-2-0 |
| సత్యాభాయి | 0-14-0 |
| సావిత్రి | 0-12-0 |
| సారంగధర | 0-12-0 |
| కుశలవ | 0-12 0 |
| బొబ్బిలియుద్ధనాటకం(శ్రీ॥కృ॥ | 1-0-0 |
| పాంచాలీమానసంరక్షణం | 1-0-0 |
| భక్తరామదాసు | 1-0-0 |
| కృష్ణలీల | 1-0-0 |
| సుమతీదేవి | 0-12-0 |
| పాండవాజ్ఞాతవాసం | 0-12-0 |
| పీష్వానారాయణరావు | 0-12-0 |

| | |
|---|---|
| చింతామణి కా॥నా॥ | 1-2-0 |
| చతురచంద్రహాస | 0-12-0 |
| శ్రీరామనిర్యాణం | 0-8-0 |
| కీచకవధ | 0-10-0 |
| స్వప్నవాసవదత్త | 0-6-0 |
| కర్ణభారము | 0-4-0 |
| **నవలలు.** | |
| ఆంగ్లరాజ్యస్థాపనం | 2-10-0 |
| యుగంధరవిజయం | 2-4-0 |
| మానసింగ్ | 1-8-0 |
| కాళిక | 1-0-0 |
| ప్రచండభైరవం | 0-12-0 |
| పద్మిని | 1-4-0 |
| నాచెరసాలఅనుభవం / మహాత్మాగాంధివిరచితం | 0-12-0 |
| పద్మరాణి | 0-120 |
| రామకోటి | 1-0-0 |
| జీవకారుణ్య | 0-12-0 |
| జ్ఞానరత్నం | 0 4-0 |
| భక్తచింతామణి | 0-5-0 |
| ఆంధ్రమనుధర్మశాస్త్రం | 2-0-0 |
| స్త్రీలవేడుకపెండ్లిపాటలు | 0-8-0 |
| మహిళామనోరంజని | 0-5-0 |
| భట్టివిక్రమాదిత్యునికథ క్యాలికో బైండు | 2-0-0 |

వలయువారు— కే. కే. పట్నాయక్ & బ్రదర్సు

బుక్కుసెల్లర్సు—ఏలూరు, కృష్ణాజిల్లా.

